శ్రీ

పట్టభంగరాఘవ మను

# పాదుకాపట్టాభిషేకము

గ్రంథకర్త :

కీ॥ శే॥ పానుగంటి లక్ష్మీనరసింహారావు పంతులుగారిచే

రచింపఁబడినది.

ప్రకటనకర్త :

కపిరుకవారి సుబ్బారావు సన్స్

ప్రొప్రయిటర్సు ; సరస్వతీ బుక్ డిపో, బెజవాడ.

రైల్వే బుక్‌స్టాల్సు :

నెల్లూరు, ఫవరుపేట, తాడేపల్లిగూడెం.

1960

## ఇందలి పాత్రలు

**పురుషులు**

దశరథుడు—కోసలదేశాధిపతి
రాముడు
భరతుడు
లక్ష్మణుడు    దశరథపుత్రులు
శత్రుఘ్నుడు
వసిష్ఠుడు    మునులు
జాబాలి
సుమంత్రుడు—రాజమంత్రి
భద్రుడు
శచుడు    ద్వారరక్షకులు
విజయశర్మ
సురుచిరుడు    బ్రాహ్మణులు
సోమనాథుడు
భ్రమరకుడు
సేవకుడు

**స్త్రీలు**

కౌశల్య
సుమిత్ర    రాజభార్యలు
కైకేయి
సీత—రాముని సతి
మంథర—కైకేయిపరిచారిక

## హెచ్చరిక

ఈ నాటకముయొక్క సర్వహక్కులు నాకు చెందివున్నవి.

ఈ నాటకమును ప్రదర్శించుటగాని, ప్రదర్శింప జేయుటగాని, రేడియో గ్రామఫోను సినిమా వగైరా సమస్త హక్కులలో నా పర్మిషనుపొంది వుపయోగించవలెను. పర్మిషను లేకుండా ప్రదర్శించువారలపై నేను జరుపు సివిల్ క్రిమినల్ చర్యలకు బాధ్యులగుదురు.

ఇట్లు,

కురుకూరి స్వరాజ్య వెంకట సత్యనారాయణరావు.

ప్రొప్రయిటరు :

సరస్వతీ బుక్ డిపో, విజయవాడ-1.

# భీష్మ బ్రహ్మచారి

(గ్రంధకర్త: కీ॥ శే॥ సోమరాజు రామానుజరావుగారు)

బెజవాడ మైలవరం బాలభారతీసమాజమువారిచే పలుసార్లు ప్రదర్శింపబడి పండిత పామజనులచే నేకగ్రీవముగ స్తుతింపబడిన భీష్మబ్రహ్మచారి! నిత్యబ్రహ్మచారియగు భీష్ముని చరిత్రముజన్మము మొదలు మరణమువఱకు నిందు వ్రాయబడినది. శంతనునకు తన పెంపుడు బిడ్డయగు సత్యవతినిచ్చి వివాహముచేసి రాజబంధువు డనిపించుకొనిన దాశవంశీయ ప్రభువును, అనాగరిక శిఖామణియు నగు దాశరాజు "నాకు చానాకోప మొచ్చింది మంతిరీ!" అని పలుకుచు రంగస్థలమున ప్రవేశించిన ఘట్టము మొదలు ముఖ్య కథకు మధ్యమధ్యను వచ్చు దాసరాజాంతఃపుర రహస్యములును-రాజు రాణి నడుమ ప్రవర్తిల్లిన అనాగరిక ప్రణయకలహములును-మహాద్భుత హాస్యరసపరిపూరితములై కడుపుబ్బ నవ్వించుచుండును గంగాశంతనుల సంవాదమునందుయుక్తివాదమును, భీష్మప్రతినయందు గంభీరమైన పితృభక్తియు-స్వయంవరరంగమున శృంగారహాస్య వీర రసములును, పరశురామప్రవేశమున భయావకమును, అంత ప్రతిజ్ఞ-అగ్నిప్రవేశములయందు భీభత్సమును, విచిత్రవీర్యమరణ ఘట్టమున శోకరసమునుఉద్భవిల్లి చదువరులను వివిధభావములందు ముంచిమొత్తుచుండును. సాళ్వునిమధుపానరంగము సముల్లాస పారవశ్యముంగలిగించును. భీష్మార్జునుల సంగ్రామముభయదాయకము-భీష్మపతనముతో భరతవాక్యము! చక్కని పాటలు-రసవంతములగు పద్యములు గలిగి పత్రికాధిపతుల చక్కని యభిప్రాయములబడసి, ముద్దులొలుకుచిత్ర పటములతో-సర్వాంగసుందరముగా-పాలమీగడవంటి అట్ట పేపరులో ప్రప్రధమమున ముద్రింపబడిన ప్రసిద్ధనాటకము. వెల రు. 1-

**వలయువారు- సరస్వతీ బుక్‌డిపో, విజయవాడ**

బ్రాంచి: రాజమండ్రి.

పట్టభంగరాఘవ మను

# పాదుకాపట్టాభిషేకము

## ప్రథమాంకము

ప్రదేశము:— అయోధ్య దశరథుని సభాశాల

[ ప్రవేశము:—దశరథుడు, వసిష్ఠుడు, సుమంత్రుడు. ]

దశ : మంత్రీ! తలపుకొనిన పని శీఘ్రముగఁగాకుండ నిది యెంత యంతరాయము గలిగించినది ?

వసి : మీరు సందేహింపవలదు. అది యావశ్యకమే కాదని నా యభిప్రాయము.

దశ : ఎందుచేతనో యానతిచ్చెదరా?

వసి : అది యిదివఱకే యాచరింపఁబడుటచేత—

దశ : భగవానుఁడా! అది యెటులు?

వసి : గీ. వంచ నెంచి రాజులు తల వంచుకొనిరి
యెత్తు నెంచి యంజలి తలకెత్తుకొనిరి
యట్టి హరువిల్లు చెఱకును హస్తివలెను
విఱిచె నతఁ డది దిగ్జయవిధము కాదె ?

అఖిల రాజన్యమూర్ధన్య సమాజసాంద్ర మగు సత్సభలో శ్రీరామచంద్రునిచే జరిగింపబడిన యీ మహాకార్యముకంటె దిగ్విజయ మేముంది? ఆవశ్యకమని యెవ్వరో మీతో జెప్పిన దిగ్విజయమర్యాద యీ రూపమున దీఱినది. కావున నీవు సంకల్పించుకొనిన శ్రీరామభద్రపట్టాభిషేక మవశ్యము జరిగింపవచ్చును.

సుమం : పునర్దిగ్విజయమున కవకాశమేమున్నది? అందఱును సామంతరాజులే యయినపుడు దిగ్విజయ మెటులు?

దశ : వసిష్ఠభగవానుడా! సుమంత్రుడా! మీ యిద్దఱి యభిప్రాయమును దిగ్విజయ మిపు డవసరమనియే కాదా ?

వసి :
—అ.
సుమం :

దశ : అటులైన దాశరథిపట్టాభిషేకమును వెంటనే చేయుట కభ్యంతర మేమున్నది ?

వసి : ముహూర్తనిర్ణయము.

దశ : మునిచంద్రా! ప్రశస్తమైన ముహూర్త మెప్పుడు లభించునో, అంతవరకు వేచియుండవలెనా ? మాండవ్యమతానుసరణ మసమంజసమా ?

వసి : రాజేంద్రా! అంత తొందర యేల ?

సుమం : మహాప్రభూ! సామంతరాజన్యు లందఱును రావలదా! మీ వియ్యంకుడైన జనకమహారాజుగారు రావలదా? అదిగాక ప్రాక్పశ్చిమదక్షిణ సముద్రోదకముల నభిషేకమొనర్పవలయును గదా! వానినైన దీసికొనిరావలదా ? పురంతయు సింగారింపవలదా ?

వసి : సుమంత్రా! సముద్రోదకమును సంపాదించుభారము నాపై నుంచుము.

దశ : మంత్రీ! తపఃప్రభావమున గురువులవారు సాగరోదకసంపాదన మొనర్చెదరు. నీవు బుద్ధిపై భవనమున సమస్తసంభారసన్నాహన మొనర్పవలయును. అతిశీఘ్రముగ జేయవలయును. భగవానుడా! జనకాదులు రావగినదే. కాని, వారు వచ్చువఱకు నీ శుభము నాపియుంచుట నా కిష్టములేదు. అంత తొందర యేలయని మీరడిగితిరి. కావున మనవిచేసికొందును.

గీ. తారలు భయంకరంబులై ధ్వనులతోడ
నభ్రమించుచుండె పెక్కు నసంఖ్యాకముగను
మింట మంటలు కాన్పించు నింటిపైన
నేదియో యేడ్చినట్టులె యెప్పుడుండు.

పే రెత్తుటకైన నిష్టములేకున్నది.

గీ. మహోగ్రగ్రహంబు మారకంబునకు దగిన
దంపుచో నుండియైన ఛాయాగ్రహంబు
నంతయును వచ్చె; దీని సాహాయ్యమునను
నిశ్చయముగ మారక మది తెలుపుగాదె.

వసి : (తనలో) వ్యయస్థానమందున్న కుజుని మహాదశలో కేత్వంతరము వచ్చినది. దుష్టదినములే వచ్చినవి.

దశ : అది కాక—

గీ. పూర్ణచంద్రుడు రోహిణీ పొలుపువక్క
యొక్కసారి ధరాపాత మొందినట్టుల
తైలపూలాభిషిక్తగాత్రంబు నేను
గలిగినట్లుగ నొకకలగంటి నేడు.

వసి: రాజేంద్రా! దుస్స్వప్నదోషనివారణముకొఱకు శాంతులుచేయించెదను.

దశ : (నవ్వుచు) ఆసన్నమరణమే సర్వోపశాంతులను జేయనున్నది.

వసి / సుమం : హరి ! హరి !

దశ : విచార మేల ?

సీ. బహుయాగవితతిచే నహిమవైరిముఖదేవ
తానీకసంతుష్టి నాచరించి
అమరారిజంతు బాధాహరణంబుచే
నఖిలతాపసతుష్టి నాచరించి
సంతతపేఁ గన్నసంతతిచేఁ బితృ
దేవతాళిపరితృప్తిఁ జేసి
గోసువర్ణాంబరక్షోణీప్రదానంబు
చేతను విప్రులఁ బ్రీతిఁ జేసి

గీ. ఇష్టభోగాళిచేత సంతృప్తి నొంది
యెన్ని యేండులనుండియో యిలః[illegible]
చుంటి నిఁక నెన్నినష్టంబు లున్ననున్న
మెడను గట్టుకొని తిరుగవలయు [illegible]!

గీ. అంచెచివర సమీపించు నశ్వము [illegible]
బరువు వేరొకస్కంధము పైనఁబెట్టి
సద నగునని మొదము గనునటుల భువిని
సుతునిపైఁ బెట్టి మోదసంగతినిగాంతు.

గీ. జగమునప్రవర్తి మజ్జన్మపత్ర
వైఖరియు స్వప్నవిధమును బట్టియేను
దివసములవాఁడ ననితోఁచు దేవ! యిపుడె
పట్టి కీరాజ్యపట్టంబుఁ గట్టరాదె?

వసి : రాజేంద్రా! ఈదినము బొత్తిగ వాసుగ నున్నది కాదు.

దశ : ఏల?

వసి : ఈదినమున బునర్వసునక్షత్రమగుటచే. రామభద్రునకు జన్మతార.

దశ : "ప్రథమే ప్రథమం త్యాజ్యమ్" అనినారు నియా;

సుమం : (తనలో) ప్రథమకళత్రమందలి ప్రథమపుత్రుని రాజ్యమం దుంచదలంచుచుండ 'ప్రథమే ప్రథమం త్యాజ్యమ్' అను సమంగళవాక్యములు వచ్చె నేమి? హరి హరీ?

దశ : రేపు పుష్యమీనక్షత్ర మగుటచేత రామునికి సంపత్తారయగునుగాదా!

వసి : రేపు రారాటలమేకాదు, ఉదయిలగ్నము [illegible]మకార్యమునకు సర్వబలాన్వితమై యున్నది.

గీ. తామరసవైరి పుష్యమీతారఁ జేరి
యుండు పరమ పవిత్ర ముహూర్తమందుఁ
బ్రథితసౌభాగ్య సామ్రాజ్య ధన్యపదము
రామచంద్రునితోడఁ జేర్పంగవలయు.

సుమం : గీ. భవపవిత్రపుసర్వసుప్రాంతిమైన
పుష్యమీతార యభిషేకమునను నిల్చి
పూతతను జెందు; (పూజ్యతాపూజ్యత లిల
సదసదంతిక స్థితిఁబట్టి యుదయమగును.) R

దశ : (తనలో) నిజమే! రామసాన్నిధ్యమున సౌమిత్రి పవిత్రుఁ డగుచున్నాడు. మంథరాసేవచేఁ గైకేయి దుష్స్వభావ యగుచున్నది. (ప్రకాశముగా) సుమంత్రా! రామచంద్రు నిటులు [illegible]ముపై నెక్కించి తీసుకొనివచ్చెదవా?

సుమం : దేవర యాజ్ఞానుసారమే. (నిష్క్రమించును)

దశ : మునికులతిలకా!

గీ. పుత్రశోకంబుచే మృతిఁబొంద శాప
మున్న దెపు డేమి కానున్నదో యెఱుంగఁ
దలఁబఱువఁ జేర్చి రాముని, దండకాఖ్య
వననివాసము నిశ్చయపరచుకొంటి.

వసి : (తనలో) హరిహరీ! ''రాముని దండకాఖ్యవననివాసము నిశ్చయపరచుకొంటి'' నని ఈ రాజేంద్రుఁడు చెప్పుచున్నాడు.

గీ. ముందు వచ్చు మహోత్పాతమునకుఁ దగిన
పలుకిపుడె ప్రాయికంబుగా బయలువెడలు
వహ్ని పర్వతోత్క్షేపణోద్రవమున
కుఁ దరచుగ ముందు భూకంప మొదవునటులు.

(ప్రకాశముగ)

గీ. అదుగో! మాతలితోడ బలారివలెను
పక్షిరా డ్గ్రజునితోడి భానుఁడువలె సు
మంత్రుతో రథ మెక్కి రామప్రభుండు
చిన్మయానందమూర్తి వేంచేయుచుండె.

దశ : సెబాస్! గురూత్తమా! రామప్రభుడే! నిశ్చయముగా రామప్రభుడే! రామునకు ప్రభుత్వ మిచ్చుటకు మీరు సంకల్పించుకొనినతరువాత నాగునా?

[నేపథ్యమున] ఆగు. ఆగు. సుమంత్రా! ఆగు. ఇచ్చటనే రథముదిగ్గి పాదచారినై తండ్రిగారిని దర్శింతును.

దశ : గీ. రామమందరగంభీరరమ్యరవము
రుద్రవీణారవముఁబోలె రుచ్యమగును
సుతులపలుకులు వృద్ధులౌ పితలచెవుల
కమృతబిందునిష్యందంబు లగునెగాదె?

వసి : (నవ్వుచు) రాజేంద్రా! ఏమంటివి? వృద్ధులౌ పితలకేనా? వార్ధకమున తానమహోత్సవము గలుగుటచే నీ కట్టు లున్నదికాని....

దశ : మునిచంద్రమా! అందఱ కాత్మజు లమృతోపమానులేకాని యస్తమయ మదిగో యిదిగో యని యనుకొనుచున్న నాకంతకంటె నెక్కువకాదా? వస్తువువిలువ నావశ్యకతయే యభివృద్ధి జేయును గాదా!

గీ. రోగయుతునికే యారోగ్యరుచి యధికము
వడదగులువానికే శీతవారి యనువు
బద్ధునకె స్వైరతావాంఛ ప్రబలము మరి
యొడలువంగినవానికే యూతకోల.

రా: నాతండ్రీ! రా!

[రామ సుమంత్రులు ప్రవేశింతురు]

రామ ; గురూత్తమా! నమస్కారము.

వసి ; వత్సా! కల్యాణమస్తు.

రామ : తండ్రీ! నమస్కారము.

దశ : (కౌగలించుకొని) నాయనా! చిరాయురస్తు. ఈపీఠమందు గూరు చుండుము. సుమంత్రా! నీవు విపణ్యాది స్థలములకుబోయి, మనమింతకుముందు తలచిన యంశమును వెల్లడించి యందునుగూర్చి జనులయభిప్రాయ మెటు లున్నదో యెరిగిరమ్ము.

సుమం : చిత్తము. (నిష్క్రమించును)

వసి : గీ. వనధివలనను ఘనఘనాఘనము బోలె
కర్మమువలన జ్ఞానంబు కరణిఁ లోక
తతిని ధన్యము జేయ నీతండు జనన
మొందె నీవలన; జనమాన్యుండ వీవు?

రామ : (నవ్వుచు) గురూత్తమా! శిష్యునియెడల నమితవాత్సల్యముకదా!

దశ : వత్సా! నిన్నుబిలిచినయంశమేదియో యెరుగుదువా?

రామ : ఆజ్ఞాపింపగోరెదను,

దశ : గీ. ముద్దుబొట్టె మొగమునకు మొగమువాచి
వినదగినపుణ్యకథ లెల్ల వినుచు మరియు
నది యనక గుంట యనక మున్గంగదగిన
నీటిపట్టుల నెల్ల మునింగి మునిగి.

గీ. ఎక్కగారాని గుట్టల నెక్కియెక్కి
కనబడిన రాళ్ళకును మ్రొక్కి, కడకు యజ్ఞ
దైవదత్తవరప్రసాదమున, లేక
లేక, నిన్గాంచితిని బుండరీకనేత్ర.

ఇదిగాక....

గీ. సుతచతుష్టయమున భాగ్యయుతుడనైన
నేనుభుజచతుష్టయవినర్ణిద్రు డైన
యామహావిష్ణు బోలితి నంచు నీమ
హానుభావుండు కృపతోడ నానతిచ్చు.

గీ. కొడుకు రెండరున్నను బెద్దకొడుకు తనము
భాగ్రమున నున్నపుడె తండ్రి యలరు మిగుల;
ముండులను(బెద్దముల్లు పండ్రెండు చేరి
చేరినపుడె గంట గొట్టెడుగడియార మటులు? )

రామ : ఎప్పుడును జెప్పని యీవింతమాటలు నే డేల? నాన్నగారూ! నావలన నేదైన నేరము కలిగెనా?

దశ : (నవ్వుచు) నేరము కాదు. కాని, ఉపేక్ష.

రామ : అది యేదియో యానతిచ్చినయెడల దిద్దుకొందును.

దశ : (నవ్వుచు) చెప్పుచుంటినిగాదా! వినుము,

గీ. లెక్కలేనన్ని యేండ్లు నే నొక్కరీతి
శ్రమ మనక చేతనైనట్లు రాజ్యభార
మును వహించితి, నీదేహ మినుమ ? వజ్ర
మా ? యిం కెన్నాళ్ళు మోయంగనగును తండ్రి ?

చూచితివా ?

గీ. ఒడలి జనసత్వము లుడిగె; ముదుత లివిగో;
కన్నుకొడుకవు, ముందుగా గన్నవాడ
విట్టి నా క్లేశమును జూచి యిప్పుడైన
బుజము మార్చుకొనరాదె ముద్దుతండ్రి !

రామ : నాన్నగారూ ! ఇదేనా నా యుపేక్ష ?

దశ : కాదా ?

గీ. వేదవేదాంగము లెదివితివి, సత్య
రతుడ, వతిరథుడవు, మంత్రయుతుడ వంత
రరిదమనుడవు, వృద్ధవాక్యప్రసిద్ధ
గౌరవుడవు, మంగళగుణాకరుడ వంచు,

గీ. నీ గురుడె పల్కె నాతండ్రి; నీవు రాజ్య
కలితుడై యుండ గన్నార గాంచు భాగ్య
మొంద గోరితి (జనభార మొంచందగిన
యాత్మజునికన్నను బ్రియపదార్థ మేది ?)

నాయనా ! నీ వెంతమాత్రమును నా కోరిక కిప్పుడు మాఱుచెప్పగూడదు.

రామ : (చేతులు జోడించుకొని) తండ్రీ : దేవరయానతిని శిరమున ధరింతును.

దశ : రామచంద్రా! అటు చూడు — నీకును, నాకును. దేవరయగు నా మహానుభావుని యానతియే యిది.

వసి : ఒక్క నాయభిప్రాయమే కాదు. శ్రీరామచంద్రా ! నీ పట్టాభిషేక మహోత్సవసందర్శనమునకై దేవతలుకూడ వేగిరపడుచున్నారు. రేపు ప్రాతఃకాలమున బుష్యమీనక్షత్రమున నైక్ష్వాకసింహాసనమును నీ వధిష్ఠింతువుగాక ?

దశ : తథాస్తు :

రామ : నేను మాఱుపలికితినని మీరు కోపపడక నా యజ్ఞతను మన్నింప వేడెదను. అంత నిరవకాశముగ ముహూర్తమును నిర్ణయించితిరేమి ?

దశ ; అయిననేమి ?

రామ : మేనమామయింటికి బోయిన చిరంజీవి భరతుడు చిరంజీవి శత్రుఘ్నునితో రావలదా ?

దశ : (నవ్వుచు) నాయనా ! భరతునికొఱకు పట్టాభిషేక మాగవలసినదా?

[నేపథ్యమున] ఆహా ! అహా !

దశ : వారెవరు ?

వసి : సుమంత్రుడు — (తనలో) ఇది యొక దురుపశ్రుతి,

సుమం : (తొందరగ బ్రవేశించి) అహో! ఆహో! శ్రీరామచంద్రమూర్తి మహామహిమము ? అహో! అఖిలజను లాయనపట్టాభిషేకమున కతిసంతోషంతో నైకకంఠ్యముగ నంగీకరించిరి.

దశ : సెబాస్—మంత్రీ! రాఘవా! జనవాక్యము రాఘవుల కవశ్యక ర్తవ్యము కాదా!

రామ : తమ యిష్టానుసారమే.

దశ : మంత్రీ ? మహోత్సవార్హము లగు సమస్త ప్రయత్నములతిశీఘ్రముగజేయింపవలయును జుమా!

సుమం : (వసిష్ఠునివంక జూచి) మహాప్రభూ! చిత్తము.

వసి : సుమంత్రా!

సీ. పూజార్హ సంభారములు సుపక్వము నవ
ధాన్యముల్ సితపుష్పదామములును
నవవస్త్రసంఘంబు నవరత్నములు సార
ఘమ ఘృతంబును హేమకలశశతము
తరివారి దాలు శ్వేతచ్ఛత్రమును సమ
లంకృతరథము పేలాలు పసపు
కుంకుమ సర్వశుభాంతయుతగజంబు
పూర్ణ మౌ పులితోలు స్వర్ణశృంగ

గీ. మహితవృషభంబు మొదలుగా విహితములగు
వస్తువుల నగ్నిశాలలోపలను రాత్రి
యందె భద్రపరుపవలె నయ్య: నేనె
సమిధలను దర్భల సచట సంగ్రహింతు.

దశ : సుమంత్రుడా! వింటివా! ప్రమాదము లేకుండ సర్వసంభారములను జాగ్రత్తపరుపవలెను జుమా! మునివల్లభా! రామచంద్రు నిక లోనికి బంపుదునా? (నవ్వుచు) తఃవార్తను దనతల్లికి నమ్మనికి, వీరికంటె ముందుగ దనభార్యకును జెప్పుట యవశిష్టముగనున్నదికాదా! నాయనా! (కౌగలించుకొని) రేపటితోనైన నేను గృతార్థుడ నగుదును గదా!

వసి : రామభద్రా! నీకొక్క యంశమును జెప్పవలసియున్నది.

రామ : సెలవీయ వేడెదను.

వసి : (నవ్వుచు) నీవు....నీసతితో....నీరాత్రి

రామ : (తలవంచుకొనును)

దశ : (నవ్వుచు) మునిచంద్రా! అటుల సెలవిచ్చుచున్నారేమి?

వసి : రామభద్రా! నేను ముసలివాడనుగావున, నీవీసరికి భర్తృదారకుడవు కావున, గొంచెము పరిహసించితిని. రేపటినుండి నీవు మాకు బ్రభుడవే యగుదువు. అప్పుడు నీతో నిర్భయముగ మాటలాడనే కూడదు.

రామ : మహానుభావా! ప్రభుడనైన, భర్తృదారకుడనైన దేవరకుదాసుడనే

వసి : నీవు నీసతితో నీ రాత్రి యుపవసింపవలెను. జాగరము చేయవలెను. నీకు జెప్పవలసిన దిప్పటివర కింతే.

రామ : చిత్తము.

దశ : సుమంత్రుడా! నీవు రామభద్రుని రథముపై నెక్కించుకొని యంతఃపురములోనికి దీసికొనిపొమ్ము. నాయనా! నీవును జానకియు నీరాత్రి మీయమ్మ యంతఃపురముననే యుండుడు. మీకు నిద్రరాకుండ మీయమ్మ మంచికథలను జెప్పును. సుమంత్రా! కౌసల్యాంతఃపుర మీ రాత్రి మిక్కిలి పదిలముగ రక్షించుటకు సేనాధిపతితో జెప్పుము.

రామ : తండ్రీ! నమస్కారము.

దశ : పుత్రా! కళ్యాణమస్తు.

రామ : గురూత్తమా! నమస్కారము.

వసి : కళ్యాణమస్తు. (రాముడు, సుమంత్రుడు నిష్క్రమింతురు.)

దశ : గురువర్యా! తమ కటాక్షమువలన నాకు విరామము కలుగనైయున్నది. రేపటిదినము మనకు మిక్కిలి తొందరగలదినము. కావున సమస్తపస్తువు లీ సాయంకాలముననే సిద్ధపరుపవలెను.

వసి : అలాగే.

దశ : ఈ రాత్రి యెటులకడచునో యని భయముగ నున్నది.

వసి : ఎందుచేత?

దశ : ఏమియులేదు. మంచికార్యమున కంతరాయములు మెండుకదా!

గీ. మనసునకుఁ బ్రీతి యెవనిపై ఘనతరమొ, య
తని కెపుడు కీడు శంకించుమనసె; మగని
యెడల నెంతో ప్రేమంబుండి యెప్పు డతనిఁ
దిట్టుగయ్యాళి యౌభార్యతీరుఁ గాఁగ.

మహానుభావా! ఆలోచించుచున్నారేమి? పట్టాభిషేకకార్యము నెరవేరునుగద

వసి : పురుషప్రయత్నముచేత.

దశ : పురుషప్రయత్నముగాక యిందున స్త్రీప్రయత్న మేమున్నది? (లేచి) మహానుభావా! నమస్కారము. ఇప్పటినుండియు నేనుగూడ నెంతయో శ్రమమొందినగాని రేపటిమహోత్సవము జరుగనేరదు.

వసి : ఈదినమున నాకును దెరపిలేని పనియున్నది. నేనును బోవలెను.

దశ : గురూత్తమా! నమస్కారము.

వసి : కల్యాణమస్తు. (ఇద్దరు నిష్క్రమింతురు)

ప్రథమాంకము సమాప్తము.

— : —



పట్టి భంగరాఘువ వంను

# పాదుకా పట్టాభిషేకము

## ద్వితీయాంకము



ప్రదేశము—అయోధ్యలోని వీథి

[విజయశర్మ యను బ్రాహ్మణుడు ప్రవేశించును.]

విజ: ఆహా!ఆహా! అయోధ్య భూలోక వైకుంఠమువలె నున్నది. భగవానుడైన శ్రీరామచంద్రమూర్తి పట్టాభిషేకము జూచు మహాభాగ్యము జనులకు రేపు లభింపనైయున్నది. ఆహా! ఏమి యీ యలంకార సంభ్రమము.

సీ. అంబుయంత్రముల రథ్యాళినిఁ దడపెడు
వారు గోడల వెల్లఁ బ్రామువారు
ముంగిళ్ళ మురిపెంపు ముగ్గులుంచెడివారు
కదళికాస్తంభము లట్టువారు
పెద్దనిచ్చెనలెక్కి వీథితోరణములఁ
గంబాల జెండాలఁ గట్టువారు
నివ్వాళిపళ్ళెము ల్నెఱయఁ దోమెడువారు
కేళికూళులఁ బరీక్షించువారు

గీ. నందఱును దమగృహములయందె పెండ్లి
యగునటులు చాల నుత్సాహ మందువారు
భళిర! రామునివంటి శుభద్గుణుండు
కలుగఁ డింతకుముం దింకఁ గలుగబోఁడు.

సీ. బేగిరావులు, నరబ్బీగుఱ్ఱములబండ్లు
వేనవేలుగఁ గోటలోని కేగు
ఘణఘణోద్ధత ఘంటికాబద్ధకరిఘటల్
బరువులతోడ లోపలికి నేగు
కాలుబలంబు గుఱ్ఱాలబలంబును
నెదుట నీటుగ టలాయించుచుండు

దేవళంబుల నుండు దివ్యమూర్తులు దివ్య
వాహనారూఢులై వచ్చుచుండ్రు

గీ. పుట్టనుండెడి చీమలఁబోలె జనులు
పైకి లోనికి నేగుచుఁ బ్రక్క కొందగు
చును గనునుఁ దమవారిఁ బిల్చుటకుఁ జేత
సన్నఁ జేయుచుఁ జప్పటల్ జఱచుచుండ్రు.

[చప్పట్లు జఱచుచు] మిత్రమా! మిత్రమా? ఇటురా! [బిగ్గఱగ] సోమనాధుడా! ఇటు. [సోమనాధుడు ప్రవేశించును]

సోమ: ఆహా! ఇప్పుడే యింత సందడిగనున్నది. ఱే పెటు లుండునో?

విజ: నీ వెచ్చటనుండి వచ్చుచున్నావు?

సోమ: విజయవర్మా! సాని వీధినుండి.

విట: నేను శ్రోత్రియుడను గాన నచ్చటి విశేషములఁ జూడలేదు. చెప్పెదవా?

సోమ: ఏమని చెప్పను? కాంతలు బురుషులు చెంబులలోని గచ్చకాయల వలె గలగల తిరుగుచున్నారు. ఱేపటి యుత్సవమున కిప్పటినుండియు సంభారములను సంపాదించు కొనుటయందు సంభ్రమపడుచున్నారు.

సీ. లంగాలలో బొందులం గీలుకొల్పి జా
డించి దండెముల జోడించువారు
చిలుకకొయ్యలఁ దగిల్చిన యుపాంగము లెండఁ
బెట్టి కుక్కలను జీకొట్టువారు
కఱకఱ మనఁ బందికట్టచేఁ గుంకుళ్ళ
పులుసున సొమ్ములఁ దోలఁచువారు
తిరుగటిగుఱుజు మద్దెలమోపి పాత్రంబు
చేఁ గొట్టి శ్రుతుల హెచ్చించువారు

గీ. నెరవునగల కింటింటికిఁ దిరుగువారు
తంబురాల జీవాళికిఁ గంబళాంత
రోమనిచయంబు పేనువారు నయి పురుషు
లతివ లతిమోదమునఁ ద్రొక్కులాడుచుండ్రు.

సోమ : సీ. మోమునఁ బసపును బూసి నెడలుపుగాఁ
బట్టినామముఁదీర్చి ప్రసవమాలి
కలు దుంపకొమ్ముల గదియించి ఘంటలు
పెద్దమువ్వలు గల పేరు లొడల
జందెపు నెట్టుగా సమలంకరించి స
సిత వృషభంబులచెంతఁ గొండె
సిగలును వెండియురుగులు తప్పెటలును
తంబుకు తాళంబులఁ దనరి భళిర
గీ. "రాఘవుఁడె రాజు కావలెరా యటంచు"
పాడనగునంచు మోదించు వరుస నెద్దు
లు, తలలూప, గొల్ల ననవ్వీ కుతలమదరఁ
దాండవింతురు గొల్ల లా దారులందు.

విజ: ఆహా! రామచంద్రునిపై జనుల కెంత ప్రేమ! ఎంత భక్తి!

సోమ: అందుకు రెండు కారణములున్నవి.

విజ: ఏవవి ?

సోమ: రామచంద్రుడు సర్వసద్గుణసంపన్నుడు. ఇది ప్రథమకారణము.

విజ: రెండవది ?.

సోమ: [చెవివద్దకు వచ్చి] దశరథుడు దుర్మార్గుడు. ఇతని రాజ్యము గోస్తనీనది ప్రవాహమువలె నెంత దీర్ఘమో యంత వక్రమైనది. ఇతని పాలననున్న జనులకు విసుగుగా నున్నది. మొదలే వెలితిపాట. అందుపై దెల్లవారినదాక నొక్కడే పాటయగుచో వినువారి కెటులుండునో జనుల కాతీరున నున్నది. జనులు పట్టాభిషేకమునకు మొగము వాచియున్నారు. మన తండ్రులు చూడలేదు. మన పితామహులు చూడలేదు. మన ప్రపితామహులు చూడలేదు. మన వంశములోని యాదిపురుషులు చూచిరేమో యీ దశరథుని పట్టాభిషేకము! మన పూర్వులకంటె నదృష్టవంతుల మగు మనము శ్రీరామచంద్రుని పట్టాభిషేకమును జూచెదము.

విజ: ముహూర్త మవ్యవధిగా నుంచబడినది. కాని యింతకంటె నుత్సవ మెన్నోమడుగు లధికముగ నుండునుసుమా !

సోమ: కృపణుడు ధనమునకు ప్రాణమునకు లంకె దేశ దేశములనుండి బ్రాహ్మణులు రాజన్యులు వచ్చినయెడల వారివిషయమై విశేషవ్యయమగునని యెవ్వరు రాకుండునట్లు లింత నిరవకాశముగ నేర్పరుపజేసినాడు. అదిగాక ముహూర్తము మాత్ర మేమంత బాగుగనున్నది? లగ్నమును శని చూచుచునున్నాడు.

విజ: అట్టి బలహీనమైన ముహూర్తమును వసిష్ఠుడేల నిర్ణయించెను?

సోమ: అతడేమిచేయగలడు? భూపతుల ముహూర్తములు దుష్టసతుల కోరికలవలెఁ దలచుకొనినప్పుడే సమకూడవలసినవి కావా?

విజ: సామాన్యకార్యముల ముహూర్తములు తొందరగ నిర్ణయించిన బాధ యుండదు కాని యిట్టి మహాకార్యముల ముహూర్తముల పర్యాలోచనముగ స్థిరపర చిన నాపత్తుకాదా? [లెంపలు వైచుకొని] అపచార్గఘ్ను వచ్చినది.

గీ. లగ్నములకు రాఘవుని బలంబు రాని
రామునికి గల్గ్నబలముతో నేమి యగును?
సుమవితతికి వసంతునిశోభ గాని?
సుమనిధానమునకు సుమశోభ యేల?

[నేపథ్యమున] దిగు! దిగు! ఉండలబద్దయేది! లే! లే!

సోమ: అదేమి! అదేమి? అల్లరి యగుచున్నదేమి?

విజ: [అటులిటులుచూచి] అదిగో! కైకేయి మేడపై కొండ్రముచ్చు జనులు దానిని బెదరగొట్టుచున్నారు.

సోమ: [నవ్వుచు] కాదు కైకేయి దాసి-నల్లని కురూపయగుటచేతను గూని దగుటచేత నల్లరిమూకయైన జను లట్లు పరిహసించుచున్నారు. మిత్రమా! సంధ్యా సమయమైనది చూడు.

గీ. నను గమించు తేజశ్శాలి తనకులంబు
వన్నెకెక్క రాజౌనని పద్మహితుఁడు
దేహ మువ్వొంగ రాగసందీప్తుఁడగుచు
మోదమున మున్గునట్టు లంబుధినిగ్రుంకె.

మన మిక మనయిండ్లకు బోదము రమ్ము.

విజ: మన రామచంద్రుడును, జానకియు నీరాత్రి యుపవసింతురట! అట్టిచో మన మేల భుజింపవలయును? మనముకూడ భోజనములు మాని జాగరము సేయుదము.

సోమ: అభ్యంతరమేమి?

విజ: బాగుగ బరిశీలింపుము. కొండముచ్చేకాని కైకేయీ పరిచారిక కాదు సుమా?

సోమ: మంచివాడవు. ఇక్కడనుండి చూడుము సందేహమేమి? కొండ ముచ్చింత వికృతరూపముగలదిగ నుండునా?

గీ. ఆదికూర్మముపై మందరాద్రి నిలిచె
మున్ను; కాలము వ్యత్యయంబుగఁ జెలఁగ,

నిపుడు మందరోపరి గూర్మిన్పృష్ఠ మెక్కి-
ననఁగ నదె వక్రబుద్ధిలాంఛనము గాను.

కావున నిశ్చయముగ మందరమే.

విజ: మిత్రమా! దానిపేరు మందరకాదు మంథర.

సోమ: ఏదియో యొకటి; కాలవ్యత్యయ మైనపుడు వర్ణవ్యత్యయ మాశ్చర్య మేమి? చూడు దాని మొగమెట్లు మాడి యున్నట్లున్నదో? ఈ యుత్సవములు దనకు రుచించినవి కావు కాబోలు!

[నవ్వుచు] రామపట్టాభిషేకమే దీని కభిమతము కాదు. కాబోలు? ఏదో కైకేయితో దలపోసికొనుటకు వచ్చినట్లున్నది. మనము మరియొకవీధికి బోయి వేడుక జూచెదము రమ్ము. [ఇద్దరు నిష్క్రమించుచున్నారు]

ఇది విష్కంభము

ప్రదేశము:- కైకేయి యంతఃపురము మేడ

(ప్రవేశము:- మంథర)

మంథ: ఏమి, ఈ యులుకు లేమి? ఈ పరుగులేమి? ఈ గుఱ్ఱపుబండ్ల కిరకిర లేమి? ఆ యేనుగుల ఘణఘణ లేమి? ఆ జెండాల తడతడ లేమి? ఈ బూడిదబుస్స న్నల పనసలేమి? ఆ గొల్లకరాల గోలయేమి? ఈ పంగనామాలపందల తందనాలేమి? ఈ తోరణము లేమి? ఈ పీరణము లేమి? ఆ! ఆ! ఈ తప్పెటలేమి? ఈ గంతులేమి? ఈ చిందులేమి? [మరియొక వైపున దిరిగి] ఆ! ఆ! ఏమి యీవింత; ఏమి యీ మహోపద్రవము. దాయి ద్రవించుచున్నది. అయఃపిండమునుండి యమృత మొలుకు చున్నిది. ఆ! గొంతు గోసికొందునన్నను క్రొత్త కానొకనిచేత బెట్టని క్రోతి పిడికిటి కౌసల్యకు గొండంతయీవి యొక్కమాటె కలిగినది! ఇది లోకోత్పాతమే! అబ్బ! ఏమి దక్షిణలు! ఏమి దానములు! ఈ జందెములపంద లీ మహాభాగ్యముల కై యెటులు మూగుచున్నారో! దాన్యల యని సిగ్గులేక దిక్కుమాలిన కవు లెట్లు స్తోత్రముల జేయుచున్నారో! [చప్పటలు జఱచుచు] ఓసి కావేరీ! కావేరీ! ఈ గందరగోళములో నెవరికి వినబడును! ఒరీ మీగొంతుకలు కొయ్య! నోరు మూసి కొనుడు. ఓసీ కావేరీ, కావేరీ!

[నేపథ్యమున] ఎందులకు?

మం: మీయమ్మ నేడు బ్రాహ్మణ సంతర్పణము జేయుచున్నదేల?

[నేపథ్యమున] ఎందులకో యెరుగవా?

మం: ఎఱిగియుండిన నడుగుదునా? జ్యేష్ఠదేవిగారి పరిచారికలగు మీకే సంగతియైన మొదట తెలియును గాని యూరు పేరులేని యధోదేవులను గనిపెట్టు కొనియున్న మాకు దెలియునా?

[నేపథ్యమున] [నవ్వుచు] అధోదేవు లని క్రొత్తమాట చెప్పుచున్నావేమి?

మం: నా క్రొత్తమాటకేమి కాని, మీ దేవిగారి క్రొత్తచేష్ట కేమి కారణమో చెప్పు?

[నేపథ్యమున] సుగుణరతుడు.

మం: ఊఁ.

[నేపథ్యమున] శాంతవచోయుతుడు.

మం: అబ్బ! త్వరగా నేడువరాదా! ఇక మీ కంతే.

[నేపథ్యమున] అగు రామచంద్రుని.

మం: అబ్బ! చెప్పరాదా?

[నేపథ్యమున] పట్టాభిషేకము.

మం: ఆ! నిజముగానే! ఎప్పుడు?

[నేపథ్యమున] ఏప్పుడోనా? తెల్లవారుసరికి.

మం: ఇప్పుడీతని పట్టాభిషేకమున కంత తొందరయేమి? మహారాజు బాగుగ నున్నాడా?

[నేపథ్యమున] అటు లడిగెదవేల?

మం: ఏమియులేదు. అతడు మా దేవిగారి యింటి కీ యుదయమునుండి యిప్పటివరకు రాలేదులే.

[నేపథ్యమున] ఇక ముందుకూడ నటులే జరుగు నేమోలే.

మం: తెగసాగక పో.

[నేపథ్యమున] సాగదీసినసరే – చంపినసరే గూనుమాత్రము వదలదు.

మం: [తనలో] సుగుణరతుడు శాంతవచోయుతుడు నగు రామభద్రుని పట్టాభిషేక మనుటకంటె, సుగుణరతుడు శాంతవచోయుతుడునగు భరతుని పట్టాభిషేక మనుట శ్రవణానందకరముగ నుండునుగాదా! రామభద్రుఁడు రేపు పట్టభద్రు డగునా? అది మొదలు తుద యెరుగని దశరధుని యాజ్ఞయా? అందులకు మూల గూరుచుండి ముక్కుమూసుకొని మూఢుడైన ముసలిముని యామోదమా? అందుపై గలలోనైన జిల్లిగవ్వ విడుచు చెరుంగని కౌశల్యాదేవి భూసురసమారాధనమా? అదిగాక యీమూఢజనులుచెడ ద్రాగి యొడలు తెలియక తైయితక్కలా? ఏమి వింతగ నున్నది! చూచెదనుగాక! కైకేయీ! కైకేయీ! మేడపై లేదు. వేడుక జూడదిగి కాబోలును! ఆ! ఏమిది! ఏమిది! కొంపలుగాలిన ట్లీవెలుతురేమి? రామపట్టాభిషేకమునకై స్త్రీలు దీపములు ముట్టించుచున్నారా! ఆ మహోత్సవమునకే నేనుగూడ నొకవింత యగ్ని నిక్కడ ముట్టించెదను. వీరు ముట్టించిన యగ్ని తెల్లవారుసరి కారునుగాని నేనంటినచిచ్చు రేయింబగ ళ్ళవిచ్ఛిన్నముగ ,సంవత్సరములకొలది నుండును. వీరి

వత్తులను, జముదనే కొల్చునుగాని నావహ్ని. పురమును, పురజనులను, భూపాలుని-సర్వాంగకముగ దహింపజేయును. కైకేయీ ; కైకేయీ ! వట్టిమొద్దు క్రిందకుఁబోయి చూచెదను.

(క్రిందకుదిగుట నభినయించి)

కైకేయీ ! కైకేయీ ! ఇదిగో ! ఇక్కడ హాయిగా నిద్రించుచున్నది. సఖీ, సఖీ (లేపుచున్నది)

కైక : (లేచి కనులు మూసికొని) మందరా !

మం : కైకేయీ ! ఊరంద ఱాందోళనపడుచుండ నీవు స్తిమితముగ నిద్రించుచుంటివా ? ఊరంద ఱుపవసించి జాగరములు సేయుచుండ నీ వప్పుడే భోజనముచేసి ప్రక్కజేరితివా ? గ్రామములోని యశేషజనులనేత్రములయ్యం దీ దీపాలవెలుఁగు ప్రకాశించుచుండ, నీనేత్రములు కంధకారమా ? నీకన్ను లిట్టి మహోత్సవము నేల చూడఁదలఁచుకొనలేదు ? నీచెవు లిట్టి మంగళధ్వవుల నేల వినదలఁచుకొనలేదు ?

కైక : ఏమహోత్సవము ? నేను వినలేదు చూడలేదు సుమా !

మం : అలాగా ? నీవు చూడలేక కనులుమూసికొంటి వనుకొంటిని. నీవు వినలేక యీమూల దాగితి వనుకొంటిని. నీవు మనసున నాలోచింపలేక మైమఱచి నిద్రించితి వనుకొంటిని.

కైక : అలాగుకాదు. నే నేమియుఁ గనలేదు, వినలేదు.

మం : కన్ను లున్నందుల కిప్పుడైన వానిని గృతార్థముల జేసికొనరాదా ? శ్రవణము లున్నందున కిప్పుడైన వానిని పావనములుగ జేసికొనరాదా ? ఇటురా ! దేహ మశాశ్వతము. ఇంతవేడుక నీవు తిరిగి చూతువో లేదో ! ఇటురా ! ఈ చూపు తడకయొద్ద నిలిచిచూతుము. [అట్లుచేయుచున్నారు]

కైక : ఆహా ! ఎంత వేడుక జరుగుచున్నది ? ఈ సర్వజనానందమునకు గారణ మేమైయుండునో ?

మం : కైకేయీ ! నాతో నీకు బరిహాసమేల ? ఎఱుగనట్లే నటించుచుంటివి ! ఎంత గడుసుదానవు ?

కైక : నిజముగా నే నెఱుగను. నన్ను విశ్వసింపదగును.

మం : చాలు ! ఈమాటల కేమి ! మహారాజుగారి మూడవభార్యవు; ముద్దుల యిల్లాలవు; మురిపెముల గనివి. నీకే తెలియకపోవుటెట్లు ? ఇటు చూడు. భరతుని సుగుణపుంజమువలె నా దీపగణ మెటుల ప్రకాశించుచున్నదో ? భరతుని ప్రతాపరేఖలు దివి నాక్రమించువైఖరి వేకజువ్వ లె ట్లుప్పరమున కెగురుచున్నవో ? భరతుని యశశ్చంద్రికవలె....

కైక : భరతునిపే రెత్తుచున్నావు: మేనమామయింటినుండి వాడు వచ్చుచున్నాడా యేమి ? అందులకు జను లీ వేడుకను చేయుచున్నారా ?

మం : భరతుని మొగమునకు నా మొగమునకు బ్రజ లింత పండుగ జేయుదురా ? భరతుని జన్మదినమున నిట్టిపండుగ జరిగియున్నదా ? భరతుని వివాహమున నిట్టివైభవము తటస్థించెనా ? భరతుడు మేనమామగృహమునకేగుట జను నెఱుగ నైన నెఱుగుదురా ? అట్టిచో భరతు డిప్పుడు తిరిగివచ్చుచుండుటచేత జను లీ మహా పర్వమును జరుపుచుండి రనుచుంటివా ? భరతునిగొడప ప్రజలకు గావలయుననుకొంటివా ? భరతునిగొప్ప నీకును నాకును గాని యూరివారి కేమి ?

కైక ; అటులనెదవేల ? భరతుడు జనసమ్మతుడు కాని –యిప్పు డీ సంతోష విజృంభణకు గారణమేమి ?

మం : చెప్పనా ? చెప్పిన నీకు మనోవ్యథగ నుండునేమో ?

కైక : చెప్పు. ఉండిన నేమిచేయగలను ?

మం : ఏమిచేయుటకైనను నీవు శక్తిగలదానవే.

కైక : కానిమ్ము. చెప్పు.

మం : రేపు రాముని పట్టాభిషేకము.

కైక : ఆ ! ఆ ! నిజముగనే ?

మం : నిస్సందేహముగా.

కైక : (మంథరను గౌగలించుకొని) చిరకాలమునుండి వినవెంచిన యమృతోపమాన వాక్యములను జెప్పితివి !

మం ; అటులైన రామపట్టాభిషేకము నీకు సంతోషకరమేనా ?

కైక : అవశ్యము – నీకుమాత్రమో ?

మం : (తనలో) ఈమెకు రామునిపై నసూయగలిగించుట నాతరముగునని తోచదు. కావున మరియొకదారి ద్రొక్కెదను. (ప్రకాశముగా) సవతికొడుకు సామ్రాజ్యపట్టాభిషేకమునకు నీవే సహించి సంతసించుచుండ నీ తొత్తునైన నాకేమి ? కాని యీ పట్టాభిషేకమునుగూర్చి యింతదనుక నీకు దెలియకపోవుట నిజమేనా ?

కైక : నిజమే. తెలియదు.

మం . ఎందుచేత ?

మం : అనిన గోపముగాని – గాని – నీ మగడు -

కైక : (తొందరగా) అతడేమి? అతడేమి ?

మం , ఏమియు లేదు – మంచివాడు కాడు.

కైక : అనగా -

మం ; ధారళమైన యంతఃకరణము కలవాడు కాడు. ముద్దులిటు – మాటలటు మాటలిటు చేష్టలటు – పైపై మెఱుపువలపు లిటు - లోలోని మమకారము అటు. పనికిమాలిన యొడ లిటు – ప్రాణము అటు ....

కైక : [క్రోధముతో] అశెటు ?

కైక : ఉండనీయక ?

మం : నిన్ను గౌసల్యాదేవి ప్రోత్సాహముచే బుట్టినింటికిఱనుప నిశ్చయించు కొనినాడు.

కైక : ఛీ ! న న్నేల పంపును ?

మం ; భరతుని నేల పంపినాడు ?

కైక : భరతుని గౌసల్యాప్రోద్బలముచే ఱంపలేదే !

మం : నీకున్న వెర్రితనమేయిది. ఆత డిచ్చటనుండిన రామపట్టాభిషేకము జరుగదని మేనమామయింటికి మెడబెట్టి గెంటినాడు.

కైక : ఆ(! ఆ( ! నిజముగ నామగడే గెంటినాడా ? నా మగడే ?

మం : మగడో ! మొద్దులో ! మగడేకాడు. మగనితో నీసవతికూడగెంటినది.

కైక : ఆ( ! ఆ( ! ఱానిసకూడ తోడైనదా ? (ఉస్సురనుచు) దాని ననవలసిన దేమున్నది ? నానాధుడే దోషి — నానాధుడే ద్రోహి....నానాధుడే విషస్వభావుడు. ఏమీ ! నాతో జెప్పకపోవుటయేల ? నాతో నాలోచించకపోవుటయేల ? పోనీ స్థిరపఱచు కొనిన తరువాతనైన నాతో జెప్పకూడదా ? రామునిపట్టాభిషేకమునకు నే నభ్యంత రము పెట్టుదునా ? నాకు రాముడొకటియు, భరతుడొకటియునా ? సవతికొడుకులను భేదముండవలసిన యాడుదాననైన నాకే భేదములేనపుడు తండ్రియైన తనకేల యుండ వలయును ? ఈ దొంగతనమేల ? ఈ భయమేల ? ఈ సందేహమేల ? నాకొడుకును గెంటనేల ? ఈ దౌర్జన్యమేల ? మంధరా ? ఇక నాపతి నాయంతఃపురమునకు రాడం టివా ? రాకపోడుసుమీ !

మం : వచ్చుననియే నిశ్చయిపరచుము. తేపు వచ్చినలాభ మేమున్నది ?

కైక : ఏమి ?

మం : తెల్లవారుసరికి రామపట్టాభిషేక మగునెడల నీపతికి ప్రభుత్వము నశిం చునుగదా ! ఒక డింత పెట్టగ దానే తినవలసియుండిన సేవకావృత్తి కాతడు దిగిన పుడు నీ కేమిచేయగలడు ? నేను నీ యింటికివచ్చి నీకెంతమేలు సేయగలనో తేపటి నుండి యాతడు వచ్చికూడా నంతకంటె నేమున్నది ?

కైక : అయిన నింక నే నేమి చేయవలసియున్నది ?

మం : రామపట్టాభిషేకము నీ కంగీకృతకార్యము. కావున మనమద్దఱ మొక్కటేపని చేయవలసియున్నది.

కైక : ఏదది ?

మం ; సేవావృత్తి.

కైక : (కోపములో) ఏమి ? ఏమి ?

మం : నీవొక సురటియు నేనొక చామరముబుచ్చుకొని కౌసల్యాదేవికి రాజ మాతకింత విసరవలసియున్నది.

కైక : ఛీ! కాఱులు ప్రేలక నోరు గట్టికొనుము.

మంథ : నాపైఁ గోపమేల? రాముడు ప్రభువైనపుడు కౌసల్యామహాదేవికే సమస్తగౌరవములు జరుగవలసియున్నవి. ఇక నీకును నాకు నానుహారాజాజ్ఞ పాదసేవ తప్పదు తప్పదు. ముమ్మాటికిఁ దప్పదు. ఆజన్మమహాభాగ్యకలితవై, ఇంత వఱకు బత్యనురాగ విధానమవై, మహావైభవ మనుభవించిన నీ కా పరిచర్య యలవాటు లేకపోవుటచేత నంచులోఁగూడ నీకు దిట్లు మొట్లు దప్పవు కాబోలు నని నే నేడ్చుచున్నాను.

కైక : ఛీ! ఛీ! పలుమాట లాడెదవా? పతి నరచేతిలో నిమ్మపండువలె నాడించిర నేను భ్రూభంగము చేతనె దానవసంహారియగు దశరథుని గడగడలాడించిన నేను — కాంతుని సంపూర్ణవశంవదునిగ చేసికొని సవతుల నందఱిని గీ పెట్టించిన నేను పరమాభిమానధన నైన నేను నేడిప్పుడు కన్నులు తెఱవని బుడుతని సింహాసనముపై సింగారించినంతమాత్రమున — నాయాధిక్యమును వదలి, యభిమానమును బరిత్యజించి, యహంకృతిని జంపుకొని, స్వాతంత్ర్యమును మన్నుఁజేసికొని — యా పనికిమాలినదానిని గొలుతునా? దానితో మాటలాడుదునా? దానివంకఁ జూడనైన జూతునా!

మంథ : ఇవి యన్నియు వెనుకటి ప్రగల్భతలు.

కైక : వెనుకటి ప్రగల్భతలో, యిప్పటి సమర్థతలో, కాని చూచెదము.

మంథ : కనుల నీరుబెట్టుకొని రాముని రామపట్టాభిషేకమును —

కైక : కన్నీరు నేను విడువను. నా సవతిచేత విడిపింతును.

మంథ: పట్టాభిషేక మాగినప్పుడు కాదా?

కైక ; ఆఁగని వేళయైనదా? రాముడు కానీ! గీముడు కానీ! నామర్యాద పోవునపుడు నేను నోరు మూసికొందునా! ఈ బొందిలోని జీవము లెగిరిపోవుటకైన సంతోషపూర్వకముగ నంగీకరింతును గాని నా సవతియుచ్చ్రతను నేను సహింతునా అందులో నా కనుసన్నల మెలగిన సవతి—నన్నుఁజూచి దొంగమొగము వైచుకొని చల్లచల్లగ జాఱిన సవతి—తనపై నాధునితో నే నెప్పుడేమి చెప్పెదనోయని తల్లడిల్లుచుండు సవతి యిప్పుడు నా పుత్రుని మాతామహగృహమున కంపి తన కొడుకును సింహాసనాధిష్ఠాతను జేయదలిచి నా పెనిమిటిని మూలఁ గూర్చుండబెట్టి, నన్నుఁ బుట్టినింటికిఁ దోసి పెట్టనెంచి కెవ్వుమని, యేకచ్ఛత్రముగఁ బుత్రుని నెపముఁ బెట్టుకొని క్షోణీతలము నేలఁ దలఁచిన సిగ్గుమాలినదాని నా కాలిక్రింద రాయుదును గాని — ఆ! ఆ! కైకేయిని పువ్వుదుంపినట్లు త్రుంపవలెనని యెంచుచున్నది. కాబోలు! నాకుత్తుకనైనఁ గోసికొందునుగాని —

మంథ: పట్టాభిషేకమును మొండికత్తిచే నీనాథుడు కోయనేకోసినాడు.

కైక: ఏమీ! పట్టాభిషేక మహోత్సవమా? [illegible] నుండుటచే నత్యంతర [illegible] [illegible]

మంధ: [illegible]

కై: [illegible]

మంధ: రాత్రి.

కైక: రాత్రి వాసిదేమి?

మంధ: అదే!

కైక: ఏమని చెప్పెను?

మంధ: [illegible] చూచితివా నా ప్రజ్ఞ! [illegible] కొంటిని. భరతుని [illegible] కైకేయి [illegible] [illegible] నెత్తిపై [illegible] అని కౌశల్య [illegible] చెప్పినది.

కైక: (కోపముతో) హా: నీచురాలా! నీ [illegible] నన్ను నది వీధినిబెట్టి పోవుచుంటివా? చీ! [illegible] నిన్ను కోటయందు గొలుసున గోలబెట్టించని యెడల నేను కేకయాత్మజను గాను జాగ్రత్త!

మంధ: నీవు పూర్ణముగఁ దలచుకొనినయెడల నది కష్టసాధ్యమగు కార్యము కాదు కాని, నీతలచిన తరువాత నిన్నెక్కడ పాడుచేయునో యని నే నాందోళన పడుచుంటిని;

కైక: ఒక్కటియేనాఁట రాముని పట్టాభిషేకము విఘ్నమైన దనుము.

మంధ: సంతోషమే కాని, అంతమాత్రమునఁజేతనే నీ కాధిక్య మెటులు కలుగగలదు?

కైక: అందుల కేమి చేయమంటివి?

మంధ: కౌసల్యచేసిన సంవతంత్రములు రెండు-మొదటిది భరతుని రాష్ట్రపరిత్యాగంజేయుట_రెండవది రాముని రాజుచేయుట_ఇట్టికుటిల నీ ప్రతిహతకార్య మెటులుండవలయునన్న-రాముని భ్రష్ట రాష్ట్రునిజేయుట_భరతుని రాజుగాఁజేయుట.

కైక: (ఆలోచించి) జ్యేష్ఠత్వముచే రాజ్యార్హుఁడగు రాముడుండ చిన్నవాడైన భరతుని రాజుగజేయుటకు రాజంగీకరించునా? అదిగాక రాముని కర్హమైన రాజ్యమును భరతుడు స్వీకరించునా? స్వీకరించడు,

మంధ: జ్యేష్ఠత్వమువలననే యర్హతయు యోగ్యతయు గలుగునా? క్షీరసముద్రమున నమృతముకంటె విషము ముందుద్భవింపలేదా?

మం : ముఖ్యకాలము దాటిపోయినపిమ్మట నెప్పటికో నీవుచేయగలది రోదనిమే.

కైక : ఛీ ! ఛీ ! సీతల్లిపాలచే నేనును నీవును బెరిగినచనువుచేత నీవను కఠినవాక్యముల కింతసేపు సహింపలేక శాంతించుచుంటిని. ఇక జాగ్రత్త !

మం : ఆ యభిమానముచేతనే యింతగా నేడ్చుచున్నాను. ఇందుకొఱకునాపై బగసాధింపదలచితివా ? ఏమి సౌలభ్యముగానున్నది ? ఇంతకాలము నిన్ను నెత్తిపై బెట్టుకొనియూరేగి తుదకు నేలను భళ్ళున విసరికొట్టిన నీ నాధునిపై బగ లేదా ? నీనాథునకుమందుపెట్టి.నీకంటిలో మట్టిగొట్టి నీకొడుకు నింటినుండి వెడలగొట్టి నిన్ను ముప్పతిప్పలబెట్టుచున్న నీసవతిపై నీకుబగలేదా ? ఎంతవిరుద్దము ? ఎంతవిరుద్దము ! ఒక్కపాలబ్రతికి యొక్కప్రక్కబండి. యొక్కతలఁపుగలిగి యొక్కరీతిగ నిన్ను గనిపెటుకొనియుండి సర్వదా నీక్షేమమునుగోరి "శః బొరనాది" యని యింతగా బ్రాకులాడు పరిచారికనైన నాపై నీకు బగయా ?

కైక : ఆహా ! ఇక జాలు! ఇక జాలు, ప్రస్తుత భరత పట్టాభిషేకమునకు సాధనమేదో ముందు చెప్పుము.

మం : అలా గడుగరాదా ? తొల్లి దేవాసురయుద్ధమున నీవు నీపతియును-

కైక : అదేమి ? కృతయుగకార్యమైన దేవాసురయుద్ధమునకు మేముపట్టినిదే

మం : అదిగో ! ఇటిగడుసుతనపుమాటలుమాత్ర మున్నవి. గవ్వవిలువచేయని పలుకులు నీవి. రాజ్యములు నిలువచేయు కార్యములు కౌసల్యావి. అందుచేతనే యా పెద్దమ్మ పెద్దమ్మరూపముగ నీనెత్తిపై దాండవించుచున్నది.

కైక : అబ్బ ! వదరక చెప్పవలసినదేదో చెప్పు.

మం : కుళంకలజేయక వినదగినదేదోవిను. తిమిధ్వజునికి దేవేంద్రునికి జరిగినయుద్ధములో రణఘోరవగునిన్ను నీనాథుడు తీసికొని దేవేంద్రసహాయ్యమునకై పోలేదా ?

కైక : ఔనుసుమా ! ఎంతటి పూర్వవృత్తాంతమును జ్ఞప్తికితెచ్చితివి.

మం : పూర్వవృతాంతమేకాదు. ప్రస్తుతావశ్యకమైనదికూడను.

కైక ; కాని అప్పుడు ?

మం : రాక్షససాయకవ్రణపీడితుడై మూర్ఛనొందిన నీకాంతుని రథమును యుద్ధశాస్త్రనిపుణవయిన నీవు దూరస్థలమునకుబోనిచ్చినిలుప నీకాంతుండు మేల్కని నిన్నుమెచ్చి—యేమిచ్చెనో జ్ఞాపకమున్నదా ?

కైక : ఆహా ! ఆహా ! రెండువరములిచ్చినాడు. ఇచ్చి కోరుకొమ్మనగా ముందెప్పుడైన గోరెదనని చెప్పితిని.

మం : ఆముం దిప్పుడువచ్చినది. భరతుని పట్టాభిషే మొక వరము; రామ వనవాసము రెండవవరము.

కైక : ఇంకనేమి ? ఇకనేమి ? గెల్చితిమి. అవ్వా ! నీ కెంత ధారణాశక్తియే? ఈతెలివి నీకు గూనులోనున్నదికాని తలలో లేదు.

మం : పరిహాసమునకు గావలసినంత సమయము ముందున్నది. ప్రస్తుతకార్యమును జూడుము.

కైక : ఇక జూచునది యేమి ? మన సంకల్పము నెఱవేఱినది. చూడు ! చూడు ! కాని కాని.

మం : ఈచూడులు నీ కానులటుపెట్టి కార్యమును బరిశీలింపుము.

కైక : మనకు భరతపట్టాభిషేకముతోడనే సపత్ని సంపూర్ణముగ స్వాధీనయై మన సేవకురా లగునపు డనావస్యముగ వనవాసమేల ? వలదు — వలదు.

మంధ: అయ్యయ్యో ! కొంపముంచుకొన దలచుకొంటినా? అయ్యయ్యో? ఇంతదూరదృష్టి లేదేమి? రాముడు రాష్ట్రమందుండు భరతపట్టాభిషేక ప్రయోజన మేమున్నది? జను లందరు రామవశ్యులని యెరుగవా? అంతయేల? పరమశత్రువైన సవతికొడుకగుటచే నీ కాతనిపై నుండవలసిన సహజవిరోధమే లేక, నీవే యింత యభిమానముతో సంకోచించుచుండ నిక బ్రజల కాసర్వజనరంజనసమర్థునిపై నెంత యనురాగముండునో యూహించుకొనరాదా? (గుండెలు కొట్టుకొని) అమ్మ! అమ్మ! రాముడు రాజ్యమందుండ మనకు బ్రతుకులున్నవా? భరతుని రాజ్యము నిలుచునా? భరతుని ప్రాణములు నిల్చునా? అయ్యయ్యో ! ఆ లక్ష్మణుడు! మిడిసి మిడిసి రాలువాడే? కోపస్వభావుడే ? పరాక్రమసంపన్నుడే ! కొంపలంటింపడా ? నిన్ను పాతర వేయింపడా? ఇక నేమున్నది! అయ్యయ్యో! రాక రాక వచ్చు రాముని కోపమున కెదురున్నదా ? ఏమిచేసిన నైన శాంతించునా? సమస్తసైన్యము సమస్త భండారము చేతిలో నుండినను భరతుడు రాముని కీడు కొగలడా? అయ్యయ్యో! రాముదేమి సామాన్యుడా ? పైకి మెత్తనివాడుగ నున్నాడనుకొనుచున్నావు కాబోలు ఎంత కఠినుడు! ఎంత సట్టుదలకలవాడు? ఎంత బాహుబలాద్యుడు! యెంత పరాక్రమసంపన్నుడు ! అయ్యయ్యో! రాముడే ఊరకుండుటయే? తాట కాంతకుడైన రామునికి గైకేయియు మంధరయు నేమి లెక్క — ఇంత వెఱ్ఱిపడుచున్నావేమి? గాధేయసవనరంరక్షణధురీణుడైన రాముడు జృంభకాదిమహాస్త్రపరిగ్రహణ ప్రవీణుడయిన రాముడు అమ్మయ్యో! హరధనుర్దండవిఖండను డయిన రాముడు అయోధ్య నుండుటయే! ఇంతకంటె తెలివిహీనయూహ యుండునా? అట్టి రాముని కన్నెకి బ్రభంజనుడు తోడుపటునట్టు లాసౌమిత్రి అంటుకొన్నంతనే శతఘ్నివలె పేలిపడు లక్ష్మణుడు — జ్యాటంకృతిమాత విచలితదానవహృదయుడగు లక్ష్మణుడు — ప్రళయ కాలరుద్ర ప్రతిమాన ప్రభావుడగు లక్ష్మణుడు — తోడుపడగ భరతుని నామమైన నిల్చునా! ఒక్కగా నొక్క కొడుకైన భరతుని జంపుకొన దలచినయెడల రాముని యయోధ్యం దుండనిమ్ము.

కైక: మంధరా! నాబుద్ధి యింతవరకు వ్యాపింపలేదు సుమా! రామువనవాస మవశ్యము కరుగవలసినదే.

మంధ: తథాస్తు.

కైక: ఇంక నానాథు డిక్కడకు వచ్చు ప్రసంగము నాలోచింపవలయును. నే నాతనిని జూడగోరితినని నీవు చెప్పవలయు. నీ [illegible], నిన్ను జూచి యాతడు కొంటకొంటలాడుచుండు [illegible] యిట్టి కప్పు డాతనిగూర్చి కొండెములు చెప్పుచుండు వని [illegible] యొకతెను బంపుదును.

మంధ: అతడే వచ్చును. ఆ ప్రయత్నమును నేను రహస్యముగ చేసెదనులే. కాని. నీవిప్పు డేమి చేయవలయునో యెరుగుదువా?

కైక: నాకింత క్షేమకరమైన యుపాయమును చెప్పినందులకు నిన్ను గొని యాడవలసి యున్నది.

మంధ: చాలు చాలు. ఇప్పటిమాటలే. ఇది స్పష్టముగా ఫలించునంతకు నీవు నాతో మాటలాడుదువో లేదో! పోనిమ్ము! నీవు ముందు క్రోధాగారమును ప్రవేశింపవలయును.

కైక: అవియన్నియు నాకు జెప్పనేల? ఆ పాట్లేవో నేను బడెదనుగాదా?

మంధ; (నవ్వుచు) ముసలిమగనిని మూడువార్ధులనీరు త్రాగింపగల సమర్థత నీకున్నదని యెరుగునా? అట్లైన నే నింక బోయెదను. చూడు - రాముడెక్క దలచిన సింహాసనముపై భరతు నధిష్ఠింపజేయుట - అంతటితో ముఖ్యమైనది - రామ బాణము మారీచు నెగరగొట్టినట్లు - నీ కోపను - రాముని దండకారణ్యమునకు ద్రోసివైచుటయే కాక — అక్కడనుండి ఖరాదుష్యణాదిసత్త్వములతో [illegible] పర్యంతము తడుముటయే కాక — ఆ సముద్రముగూడ దాటిపోవునట్లు చేయవలయును.

కైక: తథాస్తు. నేను కోపమందిరమునకు బోవుదును.

మంధ: నేను నీభర్త నిప్పుడే జాగరూకతతో పంపెదను.

(ఇద్దరు నిష్క్రమింతురు.)

ఇది ద్వితీయాంకము.



### పట్టి భంగరాఘవమను

# పాదుకా పట్టాభిషేకము

### తృతీయాంకము



ప్రదేశము:— కైకేయి యంతఃపురములోని భాగము

(ప్రవేశము:—దశరథుఁడు.)

దశ — ఏమి? శయనగృహమైన యిచ్చటి కింక నేల రాలేదు?

గీ. విద్యలేనిముఖములాగు, విదయమైన
మనసటులు, లజ్జలేని సంభాషంబు
వలెను, శుభగతిలేని యుద్యానవనము బోలె,
చెలువలేని యిచ్చోటు నిశ్శ్రీక మయ్యె.

గీ. అట్టి పట్టంజాల దనియు నిట్లెతిట్టఁ
దగిన రుష, యట్టె యేడు పంతటనె హాస;
ముంట, నరనట్యాభినయముకంటె, సతి వి
చిత్రత, యథార్థ మాట, రంజించు నన్ను.

గీ. క్రొమ్మధుకోశమున కీఁగకాటు, స్వర్ణ
కేతకికి ముండ్లపోటు, సంస్పృతచంద
న లతకుఁ బురుగురాటు, పొందంగఁదగిన
బోఁటిసత్క్రియకుఁ జుఱుకుమాటవ్రేటు.

గీ. మొదలె మూతిముడుపు గలయిందిత, యందు
పైనఁ గొఱకచ్చువలె; గూనిబానిస యెదొ
నన్నుగుఁజిచి మూట్టించు; నంతటను బున్న
మనుగుఁ బ్రేలును మందుకాయనలె, నబల.

అంతఃపుర పరిచారకులారా! కైకేయిని మీరిక్కడ నెప్పుడు చూచితిరి?

గీ. కఱకువాయి, వక్రగాత్రనైల్యము లున్న
గూనిదాసి, కొఱుక రానికొయ్య

దీని జేరి, పంటచేనిఁ గొడవలిషా
గునను నాదుగొంతు గోయు నెపుడొ.

(నేపథ్యమున) ఎప్పుడేనో? ఇప్పుడే.

దశ—ఆహా! ఏమి యమంగళవాక్యము! (ఆలోచించి) కైకేయి యిక్కడ కెప్పుడు వచ్చినదని నే నొసరించిన ప్రశ్నమున కిది యుత్తరముఁబోలు ఇక్కడ కామె రాలేదని యనుకొనుచున్నాను వచ్చియే వెళ్ళినదఁట. వచ్చునరికి నే నిచ్చట లేకుండుటచే నాపైఁ గోపము వచ్చినదని నే నూహింతును. మఱలఁ గ్రోధాగారమున నామె ప్రవేశించెనా యేమి?

గీ. అస్మదీయాన్యవనితారుడాలయంబు
లెల్లపాడయ్యెగాని యీయింటి స్తంభ
లగ్న దార్ఢ్య మెట్టిదియొ? యీ లలన కాపు
రంబు నెలకు నిరువదిదినంబు లిటనే

అయ్యో! కోపభవన మనుమాట తలంపునకు రాఁగానే గుండెలు చెదురుచున్నవి హా! కైకేయి! నీకు గ్రోధమందిరమే కాని నాకుఁ బ్రాణసంకటమందిరము సుమా! అవిగో! యీమందిరమార్గమునఁ బుష్పములు క్రిందఁ జల్లబడియున్నవి. కోపావేశమున గచభారాలంకారములగు ప్రసవములను బలాత్కారముగ నూడంబెఱికి భూమిపై నామె బడవైచి యుండును. ఓసుమములారా!

గీ. నెలఁత లలితములౌ మిమ్ము నేలఁ గొట్టెఁ
జెలికిఁ గోపము నామీఁద, శిక్ష మీకు
గలిగె, (నింద్రియలోలు రకారణముగ
నిటులు పరమపూజ్యులను బాధింత్రుగాదె.)
గీ. కలికి కలకలనగవులఁ బలుకునపుడె
గుండె లరచేతలో నుంచుకొందు; నిపుడు
కొఱకొఱలు రుసరుసలును పరగ నెటుల
బ్రతుకువాఁడ? నిశ్చయ మిఁక బ్రతుక లేను.
గీ. దరికి రానీయకున్నను, దన్నినను, మ
ఱింత బుజ్జగింపుల నూఱడించి, దాని
కౌఁగిలింపఁగవలెఁ గష్టకలనమైన,
(భయగలితఘోటి కాతు చేపట్టినటుల.)

గీ. మొద్దులాగున మెదలని ముదితఁజింపు
నెగసి బుస్సుల పైఁబడుమగువ ప్రియత
ర యగుఁగాదె? కాసారనీరంబుకంటె
నంబుయంత్రోద్ధితాంబుపూరంబువలెను.

కాని. తిరిగి యీగూనిదాసి నాప్రియురాలితో నేమి తంత్రము పెట్టినదోయని భయంపడుచున్నాను. ఈ వక్రదేహనును గోటలోనికి రానియ్యకుండ నభ్యంతరపెట్టు వెడల న న్నియంతఃపురములోనికి రాకుండ గై కేయి వారించును కాన,

గీ. నవరసామోద మైన యీ నాలికొరకు
గూనుదానిని గూడను గూడకట్టు
కొనగనలసె; (నుద్గ్రంథంబు కొఱకు చంకఁ
బెట్టబడిన కత్తెర కాళ్ళపీటఁబోలె.) R. C

గీ, ఙ్మనఘూభర్త లఖిలాధికారు లన్న
మాటయేకాని లోలోనిపోటు లన్ని
యెవరి కెఱుగంగనచ్చు? వా రెపుడు నగరు
నందుఁ గలదాసులకు దాసు లగుట నిజము.

గీ. లలితలక్షణలీలాకలాపరూప
మంజుతమ మైన కేకయాత్మజయుఁగూడఁ
గుటిలయూ మంథరనుగూడి కుటిలయయ్యె
(వంకవెదురునఁ బ్రాకెడు వల్లిబోలె.) R. C

(కొంచెము నడచుట నభినయించి) అదిగో! అదిగో! హా! ఎంతకష్టము.

సీ. కుడిచేయి తలక్రింద నెడమచేయి యెడమ
బుగ్గపైఁ గదియించి మోము వంచి
ధరణిచే నొకపయోధరమును నవ్వలబా
హువున వేఱొకటియు నొత్తబడఁగ
మోకాళ్ళ దరిఁజేర్చి ముడిచి బిగ్గగ నుద
ర ప్రదేశమునఁ జేరంగ నదిమి
వికలితకచభార మొకకొంత ప్రక్కఁదు
ప్పటిగ వేఱొక కొంత పచ్చడముగ

గీ. శీతబాధను గుండెలరిత బండు
మానిసినబోలె నాకాంత లేనిపోని
కోపమునఁ బాముపలె బుసకొట్టు చదిగో!
ప్రక్కపాటన శయనించు పట్టినేల.

గీ. రేపటిమహోత్సవం బేమి? చేయి నివ్వ
డిట్టి ప్రారబ్ధ మేమి? హా! యెటులు కలిగె
నిద్ధి యెటులు కడతేఱునో! యెవ్వఁడెఱుఁగు
నేమి సేయుదు దైవమా యిప్పుడేను?

గీ. ఏమి సేయుట కేమున్న దింతికెట్టు
లైనఁ గోపశాంతి సేయంగవలయు
లేకయుండిన జీవము ల్నిలుపఁగలచె
నేలఁత క్రేగన్ను నా యసువులకు నెలవు.)

గీ. కోపహరణ వాక్యకోటికిఁ గ్రొత్తగా
వెదకు కొనఁగవలెనె? వేయిపఱులు
వల్లెవేసికొనిన పాఠ మున్నదికదా!
యొప్పఁజెప్పవాఁడ నువిదడకను.

(కైకేయిని సమీపించి) ప్రాణప్రియా! కైకేయీ! ఇది యేమి? ఇది యేమి? నావలన నపరాధమేమైన కలిగెనా? ఎందుల కీ కోపములు? నీకు గ్రోధస్థానమైన కౌసల్యని న్నేమైన దూలనాడెనా? అయ్యో! మాటాడవేమి? నీవు పరమాభిమాన ధనవని యెరిగియుండియే, నీవు పారతంత్ర్యదూరవని యెరిగియుండియే నీయెడ వివ్వరి ములంతయపచార మెవ్వరివలన గలుగునో యని వేయికన్నుల గనిపెట్టుచు నిన్ను సమగౌరవపూర్వకముగ నాదరించుచు నీ నిరంతరానుగ్రహప్రాప్తికి వేయిదేవుల నారాధించుచు, నీ ఛాయవలె నిన్ను సర్వద్యా యాశ్రయించుచు నా యభిమానము నా ప్రాణము నా యాత్మ నీలోనుంచుకొని విధేయుడనై నేను దినములు గడుపుకొను చుండగా నయ్యయ్యో! తిరిగి యిదియేమి? ఈ కోపమేమి? నా పాపమేమీ? ఈ రోష మేమి? నా దోష మేమి? ప్రాణనాయికా! పలుకవా? (కైకేయిపై చేయివేసి నిమురుచు) పరమవిధేయుండనైన న న్నిటులుచేయవలసినదని యాజ్ఞాపింపరాదా? నేను నీ మాట కెదురాడుటకు సమర్థుఁడనా? ఇదిగో ఇటుచూడు! అబ్బ! ఇటు చూడు! అబ్బ! ఇటుచూడు! హరి హరీ! ఎంతకర్మము తటస్థించినది?

కైక: నీ కర్మముకాదు నా కర్మము. నా ప్రారబ్ధము. నను మాటలాడింప ము. "ఏమి వాంఛించితివో యగ్గగరాదా? ఆజ్ఞాపింపరాదా? నీకు వ్యతిరేకముగ

బలుకుటకు నేను సమర్థుడనా ? పరమవిధేయుడనై నీసేవ నాచరించుచుంటినిగదా !" అంటివి. హా ! ఏమిమాటలు ! ఏమి నటనలు ! ఏమి తియ్యములు ! ఏమి నెయ్యములు ఏమిప్రమాణములు ! ఏమి వినయములు ! ఏమి స్తోత్రవిధానములు ! ఏమి దైన్యానుసంధానములు ! చాలు చాలు ! నే నెఱుగుదును. అభిమానమునువిడిచి ధైర్యపడి "దేహి" యని నోరుతెఱచి చేయిచాచి నీపాదములపై నీడ్గిలబడి యడుగక యడుగవలసినదానినైన నిన్నర్థించినయెడల నీవు నాకోర్కె సమకూర్చెదవా ? నా దీనత్వమునుబాపెదవా ? నా ముద్దు చెల్లించెదవా ? ఎందులకు ? ఎందులకు ? కొండలుదాటిపోవు బూటకముమాటలతో నేమి ప్రయోజనము ? వలదు వలదు నే నడుగనక్కర లేదు.

దశ ; అహా ! ఏమిమాట లాడుచుంటివి ? నీ వడుగుటయు నే నంగీకరింపకపోవుటకూకనా ! అటు లెప్పుడైన జరిగెనా ? ఈ తనువున జీవములుండగ నటులెన్నడైన సంభవించునా ? ఎంతమాట ? నీ వర్థింపకుండగనే నీ చిత్తస్థములగు నభిలాషలను నీముఖలక్షణములనుబట్టియు, నీ వాగ్వైఖరినిబట్టియు; నీ పరిచారికలవలన దెలిసికొనియు నే నింతదనుక నెఱవేర్చుచు నీ పరిచర్యను జేయుచుంటినని నీ వెరుగవా? నీపరిచారిక లెరుగరా ? నా మనస్సాక్షి యెరుగదా ? లోక మెరుగదా ? పరిపాలించు భగవంతు డెరుగడా ? నేను నీకు సర్వదా వశుడనైతి ననుటకు నాదైన్యము ప్రబలనిదర్శనము కాదా ? లోకోత్తరమైన నీ సౌందర్యము ప్రబలతరమైన నిదర్శనము కాదా ? ఓసి వెర్రిదానా ! ముసలిదశరథుని ముక్కుబట్టుకొని యిష్టానుసార మాడించు ముద్దులయిల్లా లెవతె యని యాబాలవృద్ధులలో నెవరినడిగినైన "కైకేయి, కైకేయి యని వా రేకగ్రీవముగ బలుకరా ? అట్టి జనవాక్య మందులకు ప్రబలనిదర్శనమని కాదా ? ఇంతయేల ? నన్ను నా రాజ్యమును బాలించునది నీవేకదా ?

కైక ! ఉన్న దీమాటల బండారమే.

దశ : మాటలబండారమో ! క్రియల నిదర్శనమో ! చూచెదవుగాక అడుగు. సర్వసిద్ధముగ నున్నాను.

కైక : లేదనుటకు.

దశ : కాదు ఇక గోరదగినది లేదనిపించుటకు నీకు నాపై గోపములేదనిపించుటకు పరమగంభీరమైన నా యనురాగమునకు లోపము లేదనిపించుటకు వినుచున్నావా ?

కైక : అబ్బ ! అబ్బ ! శ్రవణానందముగ....

దశ : మాటలచే శ్రవణానందమే కాదు. చేష్టలచే సంపూర్ణహృదయానందమీయ సిద్ధమున నున్నాను. ఇప్పుడైన నమ్మెదవా ?

కైక ; నీ వప్పుడే యేమిచేసితివని నిన్ను నమ్మవలసినది ? ఇంక నే నడుగలేదు - నీవు నిరాకరింపనే లేదు.

దశ : నిరాకరించుడయే? నాప్రాణమైనసగే — కోరుము మారుమాటాడక నీ పాదాగ్రములందు సమర్పింతును. కాని, కల్యాణీ! న న్నేల విశ్వసింపవు?

కైక : అమితాంగనాలోలుని నమ్మదగునా?

దశ : (నవ్వుచు) నాకట్టి లౌక్యమునుకలిగించిన ఇట్టి జగన్మోహనాకారు నేల విశ్వసింపవలయును?

కైక : (కోపముతో) మంథరా! ఇటురా! నాకు మరియొక గదికి దారి జూపుము! నాథునికి నేను విశ్వాసపాత్రముగాను, నే నీతనికి దుష్టస్వభావను. కౌసల్య సర్వసద్గుణాన్విత, నే నీతనికంటికి దొంగను. ఆ జ్యేష్ఠదారసాని అంతరంగముగాగ మున సర్వదా ప్రాకులాడు నే నితనికి విశ్వాసపాత్రమును గాను నోరెత్తి మొగముపట్టి మొత్తు రాకాసియైన కౌసల్య యీ మహానుభావునికి బహు విశ్వాసనిధానము నుండగా రావేమి?

దశ : (కైకేయి చేతులను బట్టుకొని) అబ్బ!....

కైక : న న్నంటకుము (చేతులు విదల్చుకొనును)

దశ : అబ్బ! ఇప్పుడు నే నేమంటినని నీకింత యాగ్రహము? అలౌకికమగు సౌందర్యమును గొనియాడుచు నాచిత్తచాంచల్యమును బరిహసించుకొంటినిగాని నాపలన తప్పేమికలిగెను? ఇంత ముక్కుమీద గోపమైన నేనెటుల బ్రతుకగలను?

కైక : జిహ్వాగ్రమున నింత యసత్యమున్న విన్న నే నేమి వాంఛింప దగును?

దశ : (ఉస్సురని) ఇక నట్టిమాట నాడకు కోరుము.

గీ. అరులయెడ ముందునకు నిడ్డయడుగు వెనుక
  కిడుట, యార్తులకై చాపఁబడినకరము
  ముడుచు టర్థుల 'కూ' యనియెడు రసనము
  తోట "నుహుహుహూ" ను చెపుడు బ్రోవగాదు.

కైక : సెబాస్! అట్టియనూచానసరణి ననుసరించి యిప్పు డిచ్చెదవా?

దశ : మనఃపూర్వకముగ — అత్యానందకరమువ ...

కైక : అదిమాత్ర మసత్యము.

దశ : అటులంటివేల?

కైక : అనకపోవుటయేల? ఎవ్వరికైన నెప్పుడయిన నేమైన నీవు మనః పూర్వకముగ నిచ్చితివా?

దశ : నీకు జ్ఞప్తిలేదుకాబోలు. ఎవ్వరికో యననేల? నీకే యిచ్చితిని.

కైక : ఎప్పుడు?

దశ : అనేకపర్యాయములు.

కైక : దేనిని?

దశ: కౌగిలిని. నీయాజ్ఞయగునెడల నిప్పుడుకూడ నిచ్చుటకు సిద్ధముగ నున్నాను (కౌగిలింపబోవును)

కైక: ఇది పరిహాససమయము కాదు. మాయావాక్యములచే నౌచిత్యవృత్తి నజ్ఞానయుతబాలికలకు నాటకవస్తువుంచేవలె బ్రకృతోద్దేశముసుండ మఱలింపఁ బాటు పడుచున్నావు స నెఱుఁగుదును. ఈసారి నేను మోసపెట్టబడుదుననుకొంటివా? నన్నింతలాఘవముగ నెంచుచుంటివి?

దశ: నేనిచ్చెదననియాసపెట్టి మనఃపూర్వకముగ నెవరి కీయలేదో చెప్పరాదా.

కైక: చెప్పనేల? నీ పెల యెఱుఁగవు? యెవరికని నన్నడుగుచుంటివా? నావంటి యూడు పెరులేనివారున్నయెడల నింత ప్రతిష్ఠ నీకేల కలిగియుండును? ఎవరికో యెఱుగకుంటివేని: అనన్యగ పుత్రపట్టాభిషేకమున నిన్ను రాజ్యభారము విడువవలసినది కాని పూర్వస్మృతి యేలవిడిచెనది? ఎవరికా చెప్పవలెనా? జననమైనది మొదలు యాచ్ఞావృత్తి నెన్నఁడెఱుఁగని మహామహునికి హస్తద్వయమును హృదయాంబుజమును ముకుళింపఁజేసికొని దైన్యమున నిన్నర్థించిన మహానుభావునకిప్పటికైన జ్ఞప్తియగుచున్నదా?

దశ—(స్మృతి నభినయించి పెదవి విఱిచి) అతనికి మఱియొక లాంఛనము జెప్పుము.

కైక— అబ్బ! ఎంత విస్మృతి! అంబుజభవసన్నిభుడైన తపోధనునకు.

దశ—(సందేహముస) వ-సి-ష్ఠునికా?

కైక—కాదు వసిష్ఠునివంశమును నిరంకురము జేసినయాతనికి.

దశ: విశ్వామిత్రునికా?

కైక: అమహాతపశ్శాలియభిసంధిని నెఱవేర్తునని తెగవారెడు వాగ్దానములుచేసి కొండంతయాశ పెట్టి, నోరుతెఱచి యడుగనిచ్చి తుద కేమిచేసితివో? యింతలో మరచిన లోకము మరచు ననుకొంటివా?

దశ: ఏమి చేసితిని? రామచంద్రు నాతపస్సాంద్రునితో బంపలేదా?

కైక: అబ్బ! ఎంత నిర్దాక్షిణ్యముగ మొదట నిరాకరించితివి! ఎన్నిమాయలు పన్నితివి! ఎన్నిబొంకు లాడితివి! ఎంతధైర్యపడితివి! అబ్బ! అప్పు డేమిరోదనములు! ఏమిశిరస్తాడనములు! ఏమి మూర్ఛాపరవశతలు! ఎంతపూర్వపక్షము! ఎంత రాద్ధాంతము! ఎందఱిమాధ్యస్థ్యము, పలికిలేదనుట కెన్నివాట్లు పడితివి?

దశ: ఈ యుపాంతరగాథకేమి? సత్యవాగ్రక్షణాసక్తిచే రామభద్రుని విడుచుట కప్పుడంగీకరించితిని గాదా?

కైక: ఎప్పుడు? భైరవాకారుడై, క్రోధమూర్తియై, శాపముచే మిమ్మందఱ భస్మముచేసెదనని గాధేయుడు గంతులువైవ. నీకిది నీతి కాదని వసిష్ఠుడు నిన్ను మందలింప, దశరథుని సతులకు నాలుకలకుగూడ లెక్కలేదని లోకులు పరిహసింప, సత్యవాగ్రక్షణార్థమై కాదు - స్వప్రాణసంరక్షణాసక్తిచేత - స్వగౌరవావనాభిలాషచేత

(ప్రకాశముగా) జానకీ! నీయలంకారము మున్నెప్పుడో చూచినట్లు జ్ఞప్తి యున్నది కాని స్పష్టీకరింపలేకున్నాడను.

సీత : ఈయాభరణము లన్నియు మా తండ్రిగారు నా వివాహమహోత్సవమున నప్పగింతవేళ నాకిచ్చినారు. ఈ చీరయుగూడ నప్పటిదే. పుట్టింటివారి వస్తువను ప్రీతిచే బదునొకండేండ్లు దాటవచ్చినను దీనిని ప్రాణతుల్యముగ భద్రపఱచుకొను చున్నాను.

రామ : (ఉస్సురనుచు) ఆయప్పగింతల సమయమే యిప్పుడు తిరిగి తటస్థించినదని నేను విచారించుచుంటిని.

సీత : (కౌగిలించుకొని) ఆ! ఆ! తిరిగి నాయప్పగింతయేమి? ఆ జగదానంద మూర్తియైన శ్రీరామమూర్తికిగూడ విచారమా?

రామ : పూర్వ మసురయుద్ధమున మాతండ్రిగారికి మాపినతల్లి గారైన కైకేయి చేసిన యుపకారమున కొతడిచ్చిన రెండువరముల నిప్పుడు మాతల్లి గారు వాంఛించిరి.

సీత : అవేవి ?

రామ : పదునాలుగు వత్సరములు నా వనవాసము. భరతపట్టాభిషేకము వీని వలన నా కెంతమాత్రము విచారములేదు. కాని —

సీత : "కాని," యనుచున్నారేమి? అందులకు నేమాత్రము విచారించి మీ పితృవాక్యపరిపాలన ధర్మాచరణమును దేవరవారి సహధర్మచారిణినైన నేను ప్రతిబంధింతునా? మహాప్రభూ? ఎన్నడులేనిది నన్నిట్లు సందేహించుచుంటి రేల? ప్రాణప్రియా! మీరు పితృాజ్ఞానిర్వహణమునుగూర్చి బాస చేసియే వచ్చితిరికద.

రామ : సీతాపతినైన నేనట్లు చేయకుందునా ?

సీత : పరమసంతోషము.

రామ : ఆహా!

గీ. జ్ఞానమూర్తి జీవన్ముక్తుడైన జనక
విభుని తపమున నావిర్భవించినట్టి
నీకు నిట్టి విరాగత నిర్మలతయు
సత్యదీక్షయు గల్గు టాశ్చర్యమేమి ?

కాని, గుణగుణముచేత, ముఖవైఖరిచేత నీతండ్రిగారిని బోలిన నీకదృష్ట మేల పట్టకుండెనో యనిమాత్రము వింతగ నున్నది.

సీత : (చిఱునగవుతో) నేనే మహాదృష్టవంతురాలను, పురుషుల కధికారాల్ప పదవి భేదములచే భాగ్యాభాగ్యములు రావచ్చును. ఇక స్త్రీలకో-పురుషుడు మహారాజైననేమి? భిక్షకుడైన నేమి? ధీశాలియైననేమి? మందుడైననేమి? యుక్తకాప్ను

దైన నేమి? అపకీర్తిభాజనుడైననేమి? ప్రత్యక్షదైవమైన పతి నెడబాయకుంటయే మహాదృష్టముభవదీయ పాదరవింద నిరంతర పరిచర్య నాకు లభించియుండగ నాకు లోప మేమి?

రామ : ఇదివఱ కట్టులే జరిగెను. కాని, యింటినుండి యట్టిభాగ్యము నీకును నాకును గూడలేదు.

సీత : (తొందరతో) ఎందుచేత! ఎందుచేత!

రామ : నాకు వనవాసయోగమగుటచేతను, నీకు పురవాసమగుటచేతను.

సీత : ప్రాణనాథా! మీ మాటలవలన నవ్వు వచ్చుచున్నది! భార్య కొక యోగము, భర్త కొకయోగమునా? ఒక కన్ను బాష్పములు విడిచి యొక కన్ను ప్రసన్నముగ నుండగలదా? బండిచక్ర మొకటి ముందునకు నొకటి వెనుకకు బోగలదా? జగదేక దనుర్ధరులైన మీధనుస్సును కొకకోటి వంగ రెండవకొన యెప్పుడైన వంగకుండునా? ప్రపంచమున నెన్నడులేని భర్తృభార్యాయోగ విభేదమును మీరేల సెలవీయవలెను? మహాప్రభూ! సేవకురాల నైన నాకుగూడ వనవాసయోగ మేల యనుగ్రహింపరాదు?

రామ : అందులకు మాతల్లిగారి యాజ్ఞ కాకపోవుటచేత—

సీత : నన్ను దీసికొనిపోగూడదని యామె సెల విచ్చిరా?

రామ : లేదు. కాని నిన్నుగూడ దీసుకొని వెళ్ళుమని నా కాజ్ఞాపింపలేదు.

సీత : మంచిదే! ఈ మీసవ్యచరణమును మీతోగూడ తీసికొని వెళ్ళుమని మీయమ్మగారు సెలవిచ్చిరా?

రామ : అందులకు సెలవేల కావలెను? అది లేకుండ నే నెటుల పోగలను?

సీత : ఈ సవ్యహ స్తముమాటయో?

రామ : అదియు నటులే.

సీత : మీయవయవములలో నల్పభాగమైనదానినైన విడిచి మీరు వెడలలేనిచో నర్ధభాగమునైన నన్నెట్లు విడిచిపోగలరు? మీతల్లి మిమ్ముల సంపూర్ణముగ వనయాత్రకు బొమ్మనగ నర్ధదేహముతోమాత్ర మేగి యధిక్షేపణ మొందదగునా?

రామ (నవ్వుచు) నాదేహమున నిమిడిన భార్యారూపకార్ధము నే నెక్కడకు బోవ నక్కడకు వచ్చునదేకదా? ఇక ప్రత్యేకముగ నీవు చెప్ప నేల?

సీత : తెలియ కటుల చెప్పినందులకు క్షమింపుడు. కావున నేను మీవెంట వత్తును.

రామ : వచ్చినట్లే యనుకొనుము.

సీత : అదియేమి! మహాప్రభూ! అటు లానతీయవలదు మీ కష్టసుఖము లన్నిటిలోను నే నర్ధభాగమును గ్రహింపక తప్పదు!

రామ : జానికీ! నీవు వానప్రస్థభాగమును చెప్పితివి. కాని నస్మతీయ కష్ట సుఖార్థభాగము నీకు దప్పనే తప్పదు.

గీ. కందమూలములు హస్తయుగ్మమునఁ ద్రవ్వ
నాడుపాలున సగపాలు నీదె; యక్షి
గోచరంబైన వనచిత్రకోటినిలని
మోదమున నర్థభాగంబు ముదిత నీదె.

గీ. పాణియుగమున మునులసేవలను జేయఁ
గలుగు సుకృతిలో నర్థభాగంబు నీదె
దీని విల్లూది దీనిచే దిగిచి యసుర
వరులఁ జంపుకీర్తిని నర్థఫలము నీదె.

నీవిచ్చుట నున్నను పశ్చానుసరణఫలము నీకు దప్పదు. ఇచ్చుటనే యుండుమని నేను చెప్పుట కెందులకు సాహసించితినన -

గీ. రాష్ట్రజనపాలనము, బంధురాజసేవ
యాటవికమునిసేయు ననెడు మూడు
పనులు కర్తవ్యములు భూపవరున కిలను
వెలఁది యగ్నిత్రితయసేవవిధము గాఁగ.

ఆకార్యత్రయమున జిరంజీవియైన భరతునిపై రాష్ట్రపాలనభారము చేరెను. మిగిలిన రెండుపనులు నేనే చేయవలసి యుండెను రెండును భగవత్ప్రీతికరములై రెండును సంసారతారక యోగ్యములైన పనులే -

గీ. కాననాంతస్థమునిసేవ నేను జేయ
నిటను బితృమాతృసేవకై యెవ్వరైన
వలదె తపమునకై నరుఁ డడవి కిల్లు
గదల గృహదేవతార్చ కొక్కఁడుండవలెను

కావున. వైదేహి! నిన్ను నాతల్లిదండ్రుల సేవార్థ మిచ్చుట మంచితిని, ఏమి! మాటలాడకుంటివి. గడ్డము పట్టుకొని.

గీ. ఆఱముగ్గి యిదిగో! యిదుగో! యనెడుతండ్రి
గారి ఘంటికాస్తకాలమునకు

నీవె పెద్దకొడుకవై వారి కే లేని
లోటుఁ దీర్పుటకును బాటుపడుము.

గీ. తనపనికి వేగఁ బరితాప మొనయనున్న
కైకగారిని నతిభక్తి గారవింపు
మపరిమాద చిత్తముకంటె నధికమధుర
మగును నాకు బశ్చాత్తప్త మైనమనసు.

సీత : అత్తమామల సేవ యధికఫలప్రదమని నేను మాతండ్రిగారివలన బోధింపబడి యటు లాచేరించుచునే యున్నాను. కాని. వారలసేవ నాకుబతిసేవ తరువాతననియును, పతి నెన్నడును విడిచియుండవలదనియు మాతండ్రిగారు నా కాజ్ఞాపించినారు (నవ్వుచు) పితృవాక్యపరిపాలపుణ్యము మీరు కట్టుకొని నన్నేల కట్టుకొననీయరు? ఆపుణ్యముతో బాటు నిరంతరకాంతసేవామహాసుకృతముకూడ నాకు కానున్నది. కావున, మహాప్రభూ! కా దనక నన్ను గటాక్షింపుడు. మా యత్తమామల చరిచర్యకు గుణవతులైన ముగ్గురు తోడికోడం డ్రున్నారు. భక్తి ధురంధరులగు ముగ్గురు మఱధు లున్నారు.

రామ : శత్రుఘ్నుడు మిక్కిలి చిన్నవాడు. అత డందుల కసమర్థుడు; భరతుడు రాజ్యభారనిర్వహణముననే శోషిలి పరిచర్య నపేక్షించియుండువాడు. లక్ష్మణుడు నాతో వచ్చును. కావున నీ కీ వృద్ధసేవావిశేషము తప్పదు.

సీత : (కన్నులనీరు పెట్టుకొని) మీపాదసేవకు లక్ష్మణు నంగీకరించి నన్ను నిరాకరింతురా? దయాసత్యములు ధర్మము ననుసరించు నటుల మే మిద్దఱము మిమ్మె ప్పుడు విడువక, మీ చరణదాస్యముచే మాతనువులు పవిత్రములుగ జేసికొనుచుంటిమి కదా? మీతో రానీయకుండుటకు నేను జేసినపాప మేది? మీ సేవకంటె నాకు దారక మార్గము మఱియొకటి యున్నదా? లోకోద్ధరణార్థ మవతరించిన మహామూర్తులరని నారదాదులు మాతండ్రిగారితో బహువిధముల మిమ్ముల బ్రశంసించియుండ. న న్నీదుః ఖమునుండి యేల యుద్ధరింపజాలరు. అడవినుండి కిరాతులు రాక్షసులు, క్రూరమృగ ములుకూడ మీసదానందరూపదర్శనమున గృతార్థతను బొందనుండగ భార్యనైన నాకేనా యీ పాపదశ?

రామ : సీతా : నాకు పిత్రాజ్ఞ యెట్టు లవిలంఘనీయమో నీకుఁ బత్యాజ్ఞ యట్టిదేకద.

సీత : (రామునిపాదములబట్టుకొని) అట్టిదే. అంతకంటె నెక్కువదికూడను.

రామ : కావున, నీ విక్కడనే యుండుము.

సీత : (బిగ్గఱగా నేడ్చుచు) ఉందును. ఈతనువు నిచ్చటనే యుంతును.కాని ప్రాణనాధా! ప్రాణము లీతనువులో నుండునట్లు నే నెట్లు చేయగలను? దయాళూ అసాధ్యమైనపనిని జేయుమని నన్ను నిరోధించిన నేను చేయగలనా?

రామ : (సీతను దరిజేర్చుకొని) సీతా! నాకంటె పవిత్రజన్మవై నన్ను నాతో పాటుగ శ్రమ మొందజేయనొల్లక యటు లంటిని విచారింపకుము. కాని.

గీ. వెఱ్ఱిరాముఁడు యువసతి స్నీడలేక
భీకరవలాశసాంద్రాటవీప్రదేశ
మునకు నామెను గొనిపోయె, వెనుక నేమి
ముప్పు వచ్చునో యని జను ల్మొచ్చటింత్రు.

సీత : (నవ్వి) కుబేరునిభార్యకు దారిద్ర్యమా? సూర్యునిభార్యకు చీకటి బాధయా? అటులే యసురఖండనపటిష్ఠుడైన మహారధికునిభార్య కసురబాధ యెచ్చటిది? అట్టితలబరువురక్కసు డెవ్వడైన నట్టిద్రోహమొనర్ప బ్రయత్నించినచో వాని నింశము నిర్మూలముకాదా?

రామ : అగుట కేమైన సందేహమా? కాని పై దేహీ! నీ ప్రయాణముగూడ నిక దప్పనిదేకాదా?

సీత : మీ కాశ్రితరక్షణముతోపాటు నాకు పతిసేవతోపాటు.

రామ : అటులైన వేగరమ్ము. మాయమ్మగారియొద్దకు బోయి సెలవుతీసికొని వెళ్ళుదము రమ్ము. ఇది చతుర్ధాంకము (ఇద్దఱు నిష్క్రమింతురు)

—(o)—

పట్టి భంగరాఘవమను

# పాదుకా పట్టాభిషేకము

పంచమాంకము

ప్రదేశము :- దశరథ సభాశాలా పురోభాగము

(ప్రవేశము :- (ఏడ్చుచు) కౌసల్యయు, సీతారాములు)

కౌస : (గుండెలు కొట్టుకొని) నాయనా! నాతండ్రీ! నన్ను విడిచిపోవుదువా?

రామ : అమ్మా! విచారింపకుము.

కౌస : హా తండ్రీ! విచారముగాక యిక నాకు సంతోషమెక్కడిది? నన్నుజూచి దుర్మోర్తి తిట్టు నా దుర్మార్గురాలు తుద కిట్టు చేసినదా? హా నాయనా! నీ విశ్లేషమును నేను సహింపలేనురా! తండ్రీ! (ఏడ్చును)

రామ : తల్లీ! ఊరడిల్లుము.

కౌస : ఇంతకాలమునుండి నిన్ను గష్టపడి పెంచి పెద్దవానినిజేసి విద్యాబుద్ధులు గఱపించి. యొకయింటివానినిజేసి; నాతండ్రీ నీవు తండ్రిగారి సింహాసనము నధిష్ఠించియుండగ జూడవలెననియెంచి కొండంత మహానందముతోనున్న నాకెంత ప్రారబ్ధ మాకస్మికముగ దటస్థించెను నాయనా! నీవు వనమునకు బోవుట తప్పదా? మమ్మిద్దఱను నీ చేతులమీదుగా నడపి మఱి పోరాదా?

రామ : అమ్మా!

సీ. పడరానియిడుమల బహువత్సరము లొంది
కానఁగారాని సంతాన మిలను
బ్రోపించి నాతండ్రి పలికినమాటను
తలఁదాల్చి యతనిసత్యప్రతిజ్ఞ
కాపాడి తత్పరోద్గతులకు నిరువది
యైదేండ్ల వయసున్న యట్టిపెద్ద
కొడుకనై మునిజనకోమలపదపద్మ
సంసేవనక్రియ సలుపునట్టి

గీ. యేని పాటుపడకయున్న నింకఁ గొడుకు
లేల? పుత్త్రిలు లే రని యేడ్చు టేల?
నరుల కుద్వాహసంబంధసరణి యేల?
స్త్రీపురుషజన్మభేదసంసిద్ధి యేల?

తండ్రిగారిని నాచేతిమీదుగ బంపినపిదప వనమునకు వెడలుమని నీవు చెప్పితివి.

గీ. కట్టెను శ్మశానవాటికకడగఁ జేర్చు
నతడె పుత్త్రుఁడు కాఁడు, సత్యప్రవర్త
నమునఁ దండ్రియాత్మ ననంతవిమలపదవిఁ
జేర్చునాతఁడె సుతుఁ డవ చెప్పబడు.

గీ. నీకుఁ బతియైన వృద్ధావనీకళత్రి
సంతత పవిత్ర శాశ్వత సద్గతికయి.
శ్రమము నొందుట నీకు నేర్పడినవిధియె
కానఁ గాననయానము మాను మనకు

కౌస : నీతండ్రిగారి యుద్గతికై నీకు నేనును దోడుపడుట నాకు గర్తవ్యము కాన నేను నీతోడనే వత్తును. నే నిక్కడ నుండజాలను. నన్ను దీసికొనిపొమ్ము (ఏడ్చును)

రామ—గీ. తనుజయుగి బాసి తను నోపఁదగని ముసలి
నిన్నుఁగూడను బాసిన నిలువ గలఁడె?
యుడుగుసంకులు రెండూడ నలలనాడు
పటము పైత్రాడునుం బాయునటులు తల్లి!

గీ. కాన ముంగాళ్ళపైనున్న కన్నతండ్రి
నరనిముసమైనఁ ద్యజియించు టమ్మ! తగదు
సతికిఁ బతిసేవకంటెఁ బ్రసస్తతరము
పుణ్యతర మైనకృత్య మీ పుడమి లేదు.

గీ. వ్రతతపోదానయజ్ఞ తీర్థప్రయాణ
ములు సతుల కక్కఱయె లేదు మొదటిది, కడ
పటిది, పతిసేవ యా దానివలనఁ గలుగు
మునిమణీదుర్లభానంత మోదపదము.

గీ. కనఁబడని దేవుఁ బురుషులు కష్టమునను
గానవలె గాని కనులందుఁ గట్టబడిన
యీశునిల్లాలు గొల్చి యిట్టే తరించు
సులభతారక ధన్యంబు సుదతి బ్రతుకు

కావున నమ్మా! పతిసేవకై నీ విచ్చట నుండకతప్పదు. నే నిటు లనవలసి వచ్చినందులకు క్షమింపుము.

కౌసల్య : (ఏడ్చుచు) నే నిక్కడ నుండవలసినదేనా ? పరమకోపస్వభావ యగు కైకేయిచే నవి యివి యనరానియన్ని సూడుమాటలను బడుచు, నష్టకష్టముల బడుచు నామె పరిచారికలచేగూడ దిరస్కృతిని బొందుచు, గన్నకడుపు కాలపాలై, భరతచక్రవర్తిని సేవించుచు బ్రదుకుమని నీ యభిప్రాయమా ? నాయనా! సార్వభౌము నికి మాతనై మహాగౌరవము నీసరికి నొందుచుండవలసిన నేను కొడుకునకు దూరమై. సవతులకు బరిహాసభాజనమై, లోకులకు, బరమదరిద్రురాలను నిందకు బాత్రమై, గర్భదుఃఖమహాగ్ని కింధనమై, బ్రతికిన వినియోగము లేక, చచ్చిచావకుండ దినములు జరుపుకొనవలసినదేనా? నాతండ్రీ! (ఏడ్చును.)

రామ : అమ్మా! భరతుడు నీయందు విశేషభక్తికలవాడు అతడు.

గీ. కొలఁదిగా బిల నాకంటెఁ గుటుచయున్న
మాటయే కాని నామోము, మాటతీరుఁ
జాయయును గల్గు నాఁతడు, సరసహృదయుఁ
డాతనిని నన్నుఁగా నెంచనగును తల్లి !

అదిగాక, కైకేయినిగూర్చి నీవేమియు సంకోచింపవలదు. ఆమె తీవ్రభావయే యని యెంచుము.

గీ. ఇట్టి చంపునట్లేఁచి బాధించునట్టి
జనులు హానిసేయరు పంటెసలుపువోలె
నున్నజాడయే కనఁబడకుండువారు
ప్రాణములు పీల్తు రిట్టి హృద్వ్యాధిఁబోలె.

గీ. అమ్మా! క్షణకోపు లిట్టి భగ్గనుచు మండి
ప్రజల భయపెట్టి తెత్తుకారణము పోవఁ
దిరిగి వేగ శాంతింతురు నొఁటవిదయ్యో
ములని జను లెంచువాయుమూర్తులను బోలి,

నా వనవాసముతోను, భరతుని పట్టాభిషేకముతోను, దల్లిగారగు కైకేయికి సంపూర్ణకోపశాంతి యగును. కాన నామెనుగూర్చి నీవు భయపడవలసిన పనిలేదు.

కౌస : నాయనా! ఈ నిర్భాగ్యురాలి నిచ్చటనేయుంచి నీవు కాంతారమున కేగ నిశ్చయపఱచుకొంటివా? అగర్భశ్రీమంతుడవైన నీవు సమస్తసౌఖ్యములను సామ్రాజ్యపదవి నొక్కసారి పరిత్యజించి కష్టభూయిష్టమైన మునివృత్తి నెట్లు సహింపగలవు నాతండ్రీ! (ఏడ్చును)

రామ : అమ్మా! నీవెంతమాత్రము సడలవలదు. ఈమార్పువలన నాకేమియు బాధ లేదు.

సీ. కూర్చుండుటకును బంగారు సింహాసనం
బైననేమి? పులితోలైననేమి?
తల దాల్చుటకు రత్నకలిత చిత్రకిరీట
మైన నేమి? జటాలి యైననేమి?
ధరియించుట కమూల్యతమపీతకౌశేయ
మైననేమిరా? నారలైన నేమి?
క్షుద్బాధ శాంతించుకొఱకు క్షీరోదన
మైననేమి? ఫలాళి యైననేమి?
గీ. లంపటత దక్కి సత్యశీలంబు గల్గి
నాల్గుదినములు నుండి యుండనివిధాన
నెట్లొ యుండి వెడలుట కహీనభర్మ
హర్మ్యమైననేమి? యరణ్య మైననేమి?

కౌస : హా! నాయనా! మొన్న మొన్నటివాడవు నీ కెంతవిరాగ జ్ఞానసంపన్నతి యిట్టి ప్రాపంచిక సౌఖ్యపరాఙ్ముఖత్వము నీకీ పసితనములోనే యెటు లబ్బినదిరా! (ఏడ్చును)

రామ : తల్లీ!

గీ. స్వచ్ఛమూర్తివి నీవు, తేజస్స్వరూప
మునిత, పుట్టువుతోనె యీ భూవిదూర
మతము నాకుంట వింతయె? మఱుగునీట
బుట్టు నావిరి కూర్ధ్వంపుఁబోక కాదె?
గీ. ఇహసుఖములన్న నాసయు నిడుమలన్న
భయము నే నెఱుంగను గర్భభయము, వలని.

బంధ మంటదు నన్నుఁ బ్రపంచసంగ్ర
హార్ధమోతల్లి! నేఁ గర్మ మాచరింతు.

నేను కాననసీమను గష్టములబడి దుఃఖింతునేమో యను నాందోళమును బాపుట కింత దూరపుమాట చెప్పవలసివచ్చినది. నాకు నిర్భీతిగ సెలవిమ్మా.

కౌస : అన్నిటికన్నియు జెప్పి నన్ను మాటాడకుండ జేయుచున్నావు నాయనా! నీకు బ్రతివాక్యముల జెప్పుటకు సమర్థురాలనా? అదుగో! నీకు బోధించుటకు వసిష్ఠభగవానుడును నీతండ్రిగారును వచ్చుచున్నారు.

రామ : అమ్మా! వారు న న్నాపుటకు గాదు నా ప్రణామములు గైకొని నన్నాశీర్వదించి సెలవిచ్చుటకు వచ్చుచున్నారు.

కౌస : (గుండెలను గొట్టుకొనుచు) అయ్యో! నాతండ్రీ! నాతండ్రీ! ఇప్పుడే వెడలిపోవుదువా? నేను నిన్ను విడనాడలగనా? (కౌగలించుకొని యేడ్చును)

దశ : (తొందరగ బ్రవేశించి) అయ్యయో! నేనుమాత్రము విడువగలనా? రామా! రామా! రామా! (కౌగలించుకొని యేడ్చును)

వసి : (ప్రవేసించి తనలో) ఆహా!

గీ. దంపతులు చెఱియొకవంకఁ దల్లడిల్ల
నడుమ జానకీయుతరాముఁ డడరు, సోమ
యాజియును సోమిదమ్మ బాష్పాంబు లొలుక
మధ్యమున సకీలాజ్యధూమమ్ముఁ బోలె.

(పకాశముగ) దశరథా! కోసలాత్మజా! ఊఱడిల్లుడు.

కౌస : వసిష్ఠభగవానుడా! మీరాజ్ఞ యిచ్చిన పట్టాభిషేకముహూర్తము వృధపోగూడదు. కావున శ్రీరామభద్రు నిప్పుడే పట్టభద్రుని జేసి మమ్ము గృతార్థుల జేసి రక్షింపుముఁ సాష్టాంగపడుచున్నది.

వసి : (లేవనెత్తి. అపవారించి) దేవీ!

గీ. ఇరువదై దేండ్లనుండియే యీ మహాత్ము
నెఱుఁగుదువు నీవు, నేనో యనేకహాయ
నములనుండి తలంచిఁ మననముచేసి,
భక్తిఁ బ్రేమించి పూజించి, బహువిధముల
సేవఁజేయుచు, నితని సచ్చిదమల స్వ
రూపచరణ సందర్శన రూఢ మలిని
గర్వ్యమగు పురోహితతను గాంచి రఘుకు
లమును గని పెట్టుకొనియుంటి విమలచరిత!

గీ. ఇతనిపైన నీ యనురాగమే యధికమొ ?
రామనామ సంస్మరణపూర్వముగ జప
మాలఁ ద్రిప్పు సరిగిపోవు వ్రేళ్ళలు గల
ముదిమిగడ్డపు మునిరాగము ఘనమొ? కను.

గీ. ఇంతి పోటి బాపురమంచు నేడ్చుచుంటి
నేను బురుషుఁడ నందుపై బుష్యుదార
నాముఁడను బెద్దఁ గాన లోలో మఱిగెద
నితని విశ్లేష మెనఁడు సహింపగలఁడు?

గీ. ఐన నీతఁడు సత్యవాక్యాను పాల
నమును లోకార్థ మాచరింప, మతి నెంచి
యుండ, వలదనరాదు; భూమండలాధి
పత్యపద మంతకంటె గొప్పదియె తలఁప ?

కౌస : (అపవారించి) అయ్యయ్యో! నాతండ్రిని విడిచియుండవలసినదేనా? ఈ సుగుణసంపన్ను నీప్రసవసుకుమారాంగు, నీగంభీరస్వభావు, నీదయాసముద్రునయో! ఒక్కని - నాకొక్కఁడేయైనవానిని-

వసి : (అపవారించి) నీకేకాదు! ఈ పదునాలుగు భువనములకుగూడ నీత డొక్కఁడే.

గీ. కడుపునను గాంచి నీవును, గనులఁ గాంచి
యేము, ధన్యులమైనార మింకఁ జిరత
తస్సమాధిగతాటవీ వాసిమౌని
కులము దర్శించి తరియింప వలదె వేగ?

కావున, శిష్టరక్షణార్థము దుష్టశిక్షణార్థము శ్రీరామభద్రుని విడువక తప్పదు. ఏడుపును విడువుము.

కౌస : [అపవారించి] భగవానుఁడా మీ యాజ్ఞ యట్టులైనది కాన నా తండ్రిని నేను విడువగలను గాని యేడుపు పెట్టుబు విడువగలను? మీ యానతి యగునెడల శిరము నవలీల దెగగోసికొందును గాని రక్తము స్రవింపకుండ నే నాపగలనా? (ఏడ్చును)

దశ : హా! కౌసల్యా! నాతో నింతసేపటినుండియు బలుక కున్నావు.

గీ. పై మెఱుగులరాకాసి వలను దగిలి
నినుఁ దృణీకరించితి మున్నె; నీదుసుతుని
నిప్పుడాశక్తికే బలినిచ్చి యాళ్ళ
మెడను గట్టి నట్టేట దింపితిని నిన్ను.

వసి : (చెవులు మూసికొని) పాపము శాంతించును గాక!

దశ : మహానుభావా; నాపాపము శాంతించునది కాదు. ఈవోషాగ్నిజ్వాల ప్రళయకాలాంబుధరసంతవర్ష ధారాపాతమున నైన శాంతి నొందదు. (ఏడ్చును)

రామ : తండ్రీ ఊఁఱడిల్లుడు.

కౌస : నాయనా! మాకింక బ్రతికియున్నంతకాల మూఱటకాక యిక వ్యాపార మేమున్నది? మాగతి యేమిచేసిపోయెదవోయి నాయనా! (ఏడ్చును.)

సీత : అత్తా నామనవి విని కొంచె మాశ్వాసింపుడు.

కౌస : (సీతను కౌగలించుకొని) హా! సీతమ్మ తల్లీ నీవుకూడ నాతండ్రి ననుసరించి పోయెదవా? అమ్మా! ఎంత ప్రారబ్ధము పట్టెను! పండ్రెండేండ్లనుంచి కాపురమును జేయుచున్నావు. నాదిక్కుమాలిన నుదుటువ్రాత కాని నీకడుపున నొక్క కాయయైన నిదివఱకు కాచియుండరాదా? ఆ కసుగాయను దగ్గఱబెట్టుకొనియేదో యొక తీరుగ దెల్లవారవచ్చుచున్న యీ మహపాతకపుజీవనముల గడతేర్చుకొందుము గదా! (ఏడ్చును.)

దశ: కౌసల్యపైన జేయివైచి సతీమణీ!

సీ. కొడుకొ కొడుకో యని కూసిననోటికి
విధివిరామము లేక వెట్టులెత్తి
తినరానిగడ్డిని హాహాహా రని
యఱువదివైయేదు వేలైనవత్స
రము లేడ్చి కనినపుత్త్రకు నిర్వదైదేండ్ల
నాయంతవాని భ్రమింగంగఁ దలఁచు
పాతకి యింటిలోపల నింకఁ బిల్లలు
కూడనా? క్షుద్బాధకును దపించి

గీ. పిల్లలనె తను బాలింతపెద్దపులి గ
ల వనిచుట్టు రెండామలవఱకు నెట

జంతు వుండనిచోఁ బెద్దసంతతి హ
రించు నాయిల్లిఁక శ్మశాన మేలకాదు?

వసి : సత్యాగ్రహకై యింతవాడైన జ్యేష్ఠసుతుని బరిత్యజించుట కంగీక రించుట నీమహోదారతను సూచించుచుండ నిన్ను నీవేల పృథగ దూఱుకొందువు?

దశ : మహానుభావా! లోకమున కిప్పుడు సూచింపబడినది నా యుదారత కాదు? దారలోలత — కనిష్ఠదారలోలత. దారకహింసాపరాయణత — జ్యేష్ఠదారక హింసాపరాయణత. కత్తి కెఱబెట్టదగిన గయ్యాళిని, నెత్తిని బెట్టుకొని సింహాసమునఁ బెట్టదగిన సుగుణశిఖామణిని, పరమసుకుమారు నాగర్భసప జ్వలవైభవుని నట్టడవిలో బెట్టితిని.

రామ : తండ్రీ! వనవాసమునకు గష్టమని యాలోచించు చున్నావేమో? నాకు గష్ట మెంతమాత్రమును లేదు. ఏలన,

సీ. ఈబాల్యతనువున కీవె కారణమవు
 నావైభవములన్ని నీవె కాన,
నీ సత్యవాక్యంబు నిలుపుట విధ్ధి నాకు
 విధిచేయునుంటచే వెలయుఁ దుష్టి
సంతుష్టియే సర్వసౌఖ్యవిధానంబు
 బాహ్యవస్తువుల లోపలను సుఖము
లే దది చిత్తవిలీనంబు చిత్తగ
 తులఁబట్టి బాహ్యవస్తువులు కాని
గీ. బాహ్యవస్తువులవలనఁ జేపడవు చిత్త
గతులు గావునఁ గానన స్థితులు నాకు
నమితసుఖదాయకంబు లౌనయ్య మీరు
నాకొఱకు చింతవడికుండీ నతు లొనర్తు

(నమస్కరించును)

దశ : నాతండ్రీ! జ్ఞానసంపన్నుడ వైన నీ కట్లే కావచ్చును గాని దుర్మ దాంధుడనై వార్ధకమున గాటికి గాళులు చాచుకొని, నీవలన, దరింపవలెననియెంచి యింతకాలమునుండి యేడ్చుచున్న నాకు నీవిశ్లేషము కష్టముగాదా?

గీ. నీతోడ తలాడగాఁ గుశనిచయశయ్యఁ
బండి, తోకావనాథ్యవకాపాణి, నాదు

మొగమ్ముననురాలు నీబాష్పములను నీవు
దుడవనోయిగా నీకట్టైవిడుచు టేది?     (ఏడ్చును.)

కౌస : నాధా! పుత్రతులకు బాలుకావలసిన మనకిట్టి పుత్రుడేల దక్కెను? హా! మందభాగ్యులమైన మన కింక నేది గతి?

వసి : (తనలో)

గీ. బ్రహ్మముఖదేవతాచింత్యపాద పీఠ
మగు మహాతేజమును గడుపారఁ గాంచి
ధన్యు లగు వీరె యిట్లు రోదనము సేయ
వసుధ సుఖు లనఁదగినట్టివార లెవరు?

రామ : తండ్రిగారూ! ఆలస్య మగుచున్నది. అందువలన దల్లిగారైన కైకేయి కన్యథా తోచగలదు.

వసి : అర్యా! కైకేయియు, సుమిత్రా లక్ష్మణులు వేఱు వేఱుగ వచ్చు చున్నారు?

(కైకేయి, సుమిత్ర, లక్ష్మణుఁడు ప్రవేశింతురు)

లక్ష్మ : తండ్రీ! నమస్కారము, అన్నగారూ! మ్రొక్కుచున్నాడ. గురూత్తమా! నమస్కారము.

సీత : (అపవారించి చిఱునగవుతో) వత్సా సౌమిత్రీ! తుదకు నాప్రయాణ ముగూడ స్థిరపడినదిసుమా!

లక్ష్మ : (అపవారించి) సంతోషమే.

దశ : కౌశల్యా! మన గృహమహాలక్ష్మియై పెద్దకోడలివై దేహవిజూదు. ఎంతముగ్ధాంగనయో కనిపెట్టుము.

గీ. మొగమునందున జిఱునవ్వు మొలకలెత్తు
నీయుపద్రవ మేమియో యెఱుఁగ దబల
భర్తతోఁ బోదు వనుమోదభరమె కాని
యచటియాపద లెన్నెన్నొ యరయ దహహ!

కౌస : అమ్మా! సీతా! ఒక్కసారియిటురా! కవుగిలించుకొని యేడ్చెను.

సీత : అత్తా నన్నుగూర్చి మీకుగాని మామగారికిగాని విచారమువలదు. నా భర్త చక్రవర్తియైనను నే నతనికి దాసినే మునివృత్తినున్నను దాసినే. నాభర్త భాగ్యా

భాగ్యములవలన నాస్థితి మార్చనదికాదు. నాకు పత్యనుసరణమే సమస్తలోక సౌఖ్యావధి. కావున రాష్ట్రత్యాగము నాకేమి యుపద్రవముగా దోచుటలేదు. అదిగాక లోకరక్షకుడైన నాపతి ననుసరించిన నాకు గష్టము లెన్నడునురావు.

కైక : (తనలో) కాబోవుపట్టమహిషిపా ట్లిలాగున నున్నవి. వైభవము జారినప్పుడు వైరాగ్యమునకు లోటేమి?

సుమి : (అపవారించి) నాయనా! లక్ష్మణా! మరియొకసారి చెప్పుచున్నాను. పరమసుకుమారి యగు సీత నాకు బ్రాణాధిక. నీవామెపరిచర్యయందప్రమత్తుడవై యుండ యామెను నాకంటె నధికముగ భావించుకొనుచుండవలయు జుమా!

లక్ష్మ : (అప) అమ్మా! ఆయంశ మెన్నిమారులు చెప్పినను నీకు దనివిలేదు అటులాచరింపకున్న నాజన్మమునకు గృతార్థత లేదు.

దశ : తండ్రీ! రాఘవా!

గీ. మణులరాసుల బంగారుమలల భృత్య
కోట్లనడుమను బుట్టి యెక్కువగ బెరిగి
నట్టి నీవు కానడవిలో బెట్టిదంపు
జాలలో ముండ్లలో నెట్లు బ్రిదుకగలవు?

గీ. సర్వభండారచతురంగ సైన్యదాస
సంఘకలితుండవై వనస్థలికి నేగి
తనయ! ఘాతుకకర్కశాధముని విడిచి
యట నయోధ్యలోవలె సుఖ మందవయ్య

కైక : ఆ! ఆ! అదెటులు! సమస్తభండారరసామగ్రి రామునితో బంపుటకు నీకేమి యధికారమున్నది? సర్వాంగసమేత సమస్తరాజ్యమును భరతునికి సప్రమాణమున నింతకుముందేయిచ్చి తిరిగి స్వయందత్తాపహరణప్రవీణుడవై ప్రకాశింపదలచితివా? వసిష్ఠభగవానుడా! ఊరకుందురేల? నీ ధర్మశాస్త్రశిక్షలో దేలిన యీ మహానుభావునికి విపరీతబుద్ధు లేల? (మందలింపరాదా? ఆ! రాజేంద్ర! సమస్తమును రాము నెత్తి గట్టిపంపంగ సర్వశూన్యమైన యీరాజ్యమును నాకొడుకెటు లేలు ననుకొంటివి?

దశ : ఓసి! చండాలురాలా! దయ, దాక్షిణ్యము. భయము, సిగ్గు పరమార్థ చింతా లేశము లేక సర్వసద్గుణశూన్యయైన నిన్ను నే నేలినట్లే యాత డీ ధరణినేలును ఓసీ! దుర్మార్గురాలా! భరతుని రాజత్వము నీ రాజమాతృత్వవైభవము దిట్లు వెలుగునో చెప్పెగలను వినుము.

సీ. రాముఁ డడవి కేగ రాజ్యంబు వల్లకా
డౌను; నక్కలును వృకాళి నీకుఁ
జెలికత్తె లగుదురు; జీలిగు ల్తీతువు
గబ్బిలాల్ గిణాశుకములు నీకుఁ
చికిలింతలును బొమ్మజెముడు చెట్లుద్యాన
ములు; ఘూకరుతి మేలుకొలుపు నీకు
నన్ను బుగ్గిని జేయుకొన్న బంచాస్యపీ
ఠము; నాపునుక కిరీటమును నీదు

గీ. సుతుని కగు; నాకనమె గొడు గతని కిట్టు
లీశ్మశానంబు నతఁ డేలు నెపుడు నీదు
వెడనుడుల మీఱ కభిచారవిద్యఁ బర్యు
పాసనముఁ జేసి బ్రదికెడు భ్రష్టుపోలిక—

రామ : తండ్రీ! అతిథ్యసంపన్నయైన మాయమ్మగారియెడను, గురుజనభక్తి యుక్తుడగు చిరంజీవి మాతమ్మునియెడల నిట్టి కఠినోక్తులు బలుక న్యాయమగునా? (కైకేయివంక దిరిగి) అమ్మా! మునివృత్తిని బ్రచ్ఛన్నముగ నడపి నుండదలచిన నాకు గజతురగమణిసేవాది రాజ్యవైభవము లేల? నాకేమియు వలదు? సమస్త పార్థివములతో దమ్ముడ్డే పరిపాలించు గాక! ఆత డైననేమి! నేనైననేమి?

కైక : రామభద్రా! నీవు బుద్ధిమంతుడవు! ధర్మమార్గసంచారివని నే నెఱుగనా: కాని పుత్రాభిమాన ప్రాబల్యముచేత నీ తండ్రి—

క్షాన : ఓ కృపామయురాలా! ఓపుత్రవతీ! ఈ వృద్ధమహారాజు నీమూలమున జ్యేష్ఠపుత్రుని, సింహాసనార్హుని, సర్వమంగళ గుణాభిధాముండైనరాముని, నాతండ్రిని గానకు బోవలసినదని నిర్దయుడై పతికి పంపుచుండిన నతనికి కింక బుత్రాభిమాన ప్రాబల్యమని నీవు కన్నులు పొడుచుకొనుచుంటివా? కన్నందులకు దండ్రి కా మాత్రమైన నభిమా ముండక, పిల్లలను గండుకొఱికినట్లు కొఱుకుమని నీ యభిప్రాయమా కడుపుతీపు తెలిపిన నీకే యీపోగాలమా!

కైక : పోగాలము నాకు గాదు. నీకు - నీకొడుకునకు - నీ కొడుకునకు గాటికి బోగాలము, ఆ వేడుక చూడలేక నీకు వల్లకాటికి బోగాలము.

అంద : (చెవులు మూసికొని) హరిహరీ!

రామ : అమ్మా! నీ విక మాటలాడక నీ సపత్నియెడల నిర్మత్సరవై నన్ను గూర్చి విచారము దక్కియుండవలెను. (కైకేయివంక దిరిగి) అమ్మా! మాతల్లి సంతాపాతిశయమున ని న్నాడినమాటలకు నీవు కోపపడక క్షమియింపదగును.

కైక : సంతాపమున్న గంట నిప్పులు కొట్టుకొనవలెను. గొంతెత్తి యేడ్వవలెను గాని యీ పలుగాకికూత లేల ?

లక్ష్మ : (అపవారించి రోషముతో) అగ్రగజా! దాశరధీ! ఇంకను శాంతమేనా? ఇంకను నోరుమూసికొనియే యుండవలెనా? సీసముగాల్చి చెవులలో బోసికొనుట కంటె దీక్షతరములగు పలుకులు గర్ణములం బడుచుండ బౌరుషహీనుడనై బ్రదుకవలసినదేనా ? రాఘవా! నన్ను వదలుము. నాదేహముగంపమెత్తుచున్నది. నాకడుపు మండుకొనిపోవుచున్నది; నాచెవులు చిల్లులు పడుచున్నవి! నే నిక సహింపలేను. రామా! రామా! రామా! ఇప్పుడు పనికిరాకపోయిన నాధనుస్సేల కాల్పనా ? విడు విడు ఈ రాకాసిని....

రామ : (అపవారించి) తమ్ముడా !

గీ. అమ! కఠినోక్తులకు మన మస్వాల నయి
యున్న దిద్దుకోవలెఁ గోప మూనఁ దగదు
కానిచో, మముగూర్చి కావు గాన
ననుజ! తాపంబు బొత్తిగా ననవసరము.

అదిగాక !

గీ. స్తుతికి ముదమంది నిందకు వెతను జెందు
జనునిలఘుచిత్త మెపుడు సంచలితమగుచు
శాంతతను జెంగదదు, ప్రతిదిశాసమాగ
తశ్వసన చలత్కేతు వస్త్రమును బోలె.

(కౌగిలించుకొని) తమ్ముడా! నీవిప్పు డేమియు మాటలాడకుండవలెను. (ప్రకాశముగా) తండ్రీ! దానదాసిజనస్వర్ణమణి సేనాని రాజ్యవైభవము లాగర్భ శ్రీమంతుడనైన నాకు గానసకష్టముబాధ తెలియకుండునటులు నాతోగూడ బంపుదునని మీ రానతిచ్చిరి.

దశ : నాయనా! ఆమాటలాడినందులకేకదా యింతరాద్ధాంతము జరిగినది.

రామ : తండ్రీ! అవియేమియు నాతో బంపవలదు.

గీ. సర్వసామగ్రి సృష్టిలో సౌఖ్య మీాయ
జాలియుండఁ బ్రశస్త మశస్త మంచు

వినని భేదముఁ జేసి మంచిని వరించి
చిత్తసౌఖ్య మాదారినే చెందుకం టె.

గీ. జ్ఞానమున జిత్తసుఖ మంది సకలవస్తు
కోటి సుఖదముగాఁ జేసికొనుట మంచి;
అది జలు బిది కాకని దేవులాడుకంటె
జనుఁడు జఠరదీప్తినిఁ జేసికొనుట తగదె?

గీ గురువసిష్ఠోపదేశ మీసరణి నయ్యెఁ
గావునను నాకు మట్టి బంగార మగును
బవ్వపారణమే వయఃపాశన మగు
నారబట్టలె హోంబట్టుచీర లగును.

గీ. పరిబల కానన ముద్యానవాటి యగును
జాపజాబండలే పుష్పశయ లగును
పతులే ప్రాణసన్నిభ బందు లగును
మృగతతులె నిరంకుశసేన లగును నాకు.

అదిగాక తండ్రీ!

గీ. నాకుఁ గీడేదొ యొనరించినాఁడ ననుచు
వ్యసన మొందుచునుంటి వానియె నాకు
ముద మొసంగు టె కాక సంపూర్ణ హార్ద
సంఘటనదక్షు మా జగజ్జాలమునకు.

గీ. కాన నిర్వ్యాపారము గాఁగఁ గాన కిపుడు
నన్నుఁ బంపుము నాతండ్రి! నిన్ను గురుని
ముగురుతల్లులఁ బ్రీత్యుత్తముగను గొల్చు
ముద ము గడలేత నీకఁ జిత్తమునను కొలుతు.

వసి : (తనలో)

గీ. తల్లు లశి తండ్రియని గురూత్తముఁ డటంచు
ప్రేమ టని లోకసంగ్రహము కొఱ కిటులు

వలికితివిగాని వృద్ధ్యంతభవవిదూర
పరచిదానందమయపరబ్రహ్మ మీవె.

కౌస — నాతండ్రీ! నిర్భాగ్యులమగుమమ్ము వదలి యిప్పుడే పోవఁదలచితివా? అయ్యయ్యో! నాయనా! నాయనా! తిరిగి నీముఖదర్శనము మా కెంతకాలమునకురా తండ్రి! నీకు మావస్తువు లేమియు నక్కఱయే లేదా?

రామ — అమ్మా! నాకొక్కవస్తువును గటాక్షించిన సంతోషపూర్వకముగ గ్రహింతును.

దశ | కౌస — నాయనా! ఏదది?

కైక — (తనలో) రాష్ట్రము గాఁబోలు!

రామ — ఒక్క నారబట్ట.

దశ | కౌస — హరిహరీ! హరిహరీ! (ఏడ్తురు.)

కైక — (ముందునకు నడచి) ఇదిగో! నీవు కోరిన వల్కలము. నీకొఱకు భద్రపఱచియుంటిని. శీఘ్రముగ ధరించి పొమ్ము.

రామ — (వస్త్రముల కన్నుల కద్దుకొని) అమ్మా! మహాప్రసాదము.
(నమస్కరించును.)

దశ | కౌస — అయ్యో! రామా! రామా! (ఏడ్తురు.)

రామ — గీ. ఈతనువు మిశ్రమసాధనం బిద్ది తండ్రి
గా రొసఁగిరి కేవల పరాధార మైన
దీని నీ విచ్చితివి తల్లి! దీనికంటెఁ
బ్రియతరం బైనవస్తు వీపృథివిఁ గలదె?

గీ. రాముఁ డను నొక యైక్ష్వాకరాజు భువిని
గలఁ డఁటంచును ముందురాఁ గలుగుజనులు
బలుకఁ దగియున్న యట్టి మత్ప్రథితకీర్తి
నీవలన నె రావలయును నిజముతల్లి!

తల్లులారా! గురువర్యా! తండ్రి! వస్త్రమును ధరించి వత్తును. సెలవొసఁగుఁడు. (నిష్క్రమించును.)

కౌస — (గుండెలుకొట్టుకొని) ఇఁక నేమున్నది? ఇఁక నేమున్నది?

కైక — సౌమిత్రీ! ఇదిగో! నీ కొక్కవల్కలము.

లక్ష్మ — నీవసన మెవనికిఁగావలెను? అది భరతునికొఱకు భద్రపఱచుకొనుము లేదా ఒకయంచలము నీకుత్తుకకు ముడివై చుకొని రెండవయంచు భరతునిగొంతుకకు జుట్టఁబెట్టి సింహాసనమున కిద్దఱు జెఱియొకవైపున వ్రేలాడుఁడు. నేను నావస్త్రము లను సిద్ధపఱచుకొనియేయుంటిని. అవి ధరించి వత్తును. (లక్ష్మణుఁడు పోవును.)

దశ — ఓసీ! కుటిలాత్మురాలా! ఆవస్త్రము నాకిమ్ము. ఇమ్ము.

కైక — ఇది నీకేల?

దశ — ఏలయో చెప్పవలెనా! నాశవముపైఁ గప్పఁబడుటకు — రాముఁ డెట్టి వేషముతోఁ బవిత్రమైన కాననమున కేగునో యట్టివేషముతోడనే యపవిత్రమగు నరకమునకు నేనేగెదను.

(నేపథ్యమున) నీ వొక్కఁడవేయేగ నేల ? కైకేయినిగూడఁదీసికొని పొమ్ము. శీఘ్రముగఁ దీసికొనిపొమ్ము.

దశ — ఓసీ! పాపాత్మురాలా! రామవిశ్లేషమును సహింపలేక జను లెట్లు కోటబురుజు లెక్కినిన్ను నన్ను దుమ్మెత్తితిట్టుచున్నారో చూడు?

కైక — భయమేల? భరతుఁడు వచ్చిన నన్నియు జక్కఁబడును.

[నేపథ్యమున] భరతుఁడు వచ్చుటకు రామభద్రుని వనమునకు వెడలనిత్తుమా? మాగొంతుకలఁ గోయించుకొందుము; రథమున కడ్డముగఁ బడుదుము. రామభద్రుని కాళ్ళపై బడుదుము; కాని లోకానందమూర్తియైన శ్రీరామమూర్తివిబోనిచ్చెదమా ?

(తిరిగి నేపథ్యమున మఱియొకధ్వనితో) జనులారా! తొందరపడకుఁడు మంచియో చెడ్డయో మహారాజు శాసనము అవిలంఘనీయము జాగ్రత్త! జాగ్రత్త!

దశ — గురూత్తమా! ఆకంఠస్వరము సుమంత్రునిదే కాదా?

వసి — ఔను.

దశ — సుమంత్రుఁడా! ఇటురా!

[సుమంత్రుఁడు ప్రవేశించును.]

దశ — సుమంత్రా? ఇంతసేపేమి సేయుచుంటివి?

సుమం — సేనాధిపతులను దీసికొనిపోయి జనుల మహాకలకలమును వారించు చుంటిని. మహాప్రభూ! రామలక్ష్మణులేరీ?

[నేపథ్యమున] ఇదుగో వచ్చుచున్నాము.

(నారలు ధరించి రామలక్ష్మణులు ప్రవేశింతురు.)

రామ — (అపవారించి) సుమంత్రా ! రథమును సిద్ధపఱచితివి కాదా ?

సుమం — (అపవారించి) ఆజ్ఞానుసారమే.

రామ — (నవ్వుచు) సుమంత్రుఁడా! మా మునివేషములు బాగుగనున్నవా!

సుమం. — సాలగ్రామము, స్ఫటికము సంపుటములలో నుంచినట్లున్నవి.

దశ—ఓ గురూత్తమా! ఓకోసలాత్మజా! అటు చూడుఁడు! నా తండ్రి ముదుగుగుడ్డలలోనైన నెంతతేజస్వియై వెలుఁగుచున్నాడో! చూడు.

గీ. ద్యువతిసమమైభవము లోష్టతుల్యముగను
వదలి వైరాగ్యవిజ్ఞానభవ్యభావుఁ
డై మహానందమూర్తియై! యడుగో! లుప్త
సర్వసంగుఁ డౌపరమహంసను హసించు.

(ఏడ్చుచు) నాతండ్రీ! నాతండ్రీ! ఒక్కసారి యిటు వచ్చి నన్ను గట్టిగఁ గౌఁగిలించుకొనుము. (కౌసల్యయు, దశరథుఁడు రామునిఁ గౌఁగిలించుకొనియేడ్తురు.)

గీ. అమితవనితాతిలోలుఁడ నయిననాకు
నేతవత్నీవ్రతుఁడ వుద్భయించి తౌర!
భవమహాపాశపరిబద్ధ భావుఁ డైన
నాకు భవదూరుఁడవు పుట్టినావు తండ్రి.

గీ. ఇట్టివిజ్ఞానిచేతఁ దరింపలేక
యాఁడుదానికై నిను విడనాడుకొంటిఁ
గర్మకలనకు నమితాధికతను జూపి
భక్తిఁ బోషించుకొననియ్యప్రాజ్ఞవలెను. (ఏడ్చును.)

రామ—తండ్రీ! మీరిట్లు విచారింపఁదగదు. నేనిక్కడనుండునంతసేపును మీకు విచారము ప్రబలముగనే యుండును గాన నేను బోయెదను. రథము సిద్ధపఱచితినని సుమంత్రుఁడు చెప్పినాఁడు. ఓతండ్రి! ఓతల్లులారా! నా కానతిండు.

దశ / కౌస—సుమి | రామ- రామ- రామా! అయ్యయో! (ఏడ్తురు)

కైక—రాఘవా! సీతకూడా మునికాంతావేషమును ధరింపకుండనే పోఁదలచితివా! జానకీ! ఇదిగో! నీవల్కలము. ఇటువచ్చి దీనిని గ్రహించుము.

సీత—(రామునివంకఁ జూచుచున్నది.)

రామ—జానకీ! సంతోషపూర్వకముగ మాతల్లిగారి ప్రసాదమును స్వీకరింపుము. ఆపవిత్రవల్కల మందుకొని నేత్రముల కద్దుకొని యామెకు నమస్కరింపుము.

సీత—చిత్తము. (కైకయొద్దకుబోయి యటుల చేయును.)

సుమి—అయ్యో! అయ్యో! జానకికిఁగూడ వల్కల మేల?

కౌస—నాతల్లీ! సీతమ్మా! నీకుఁగూడ నీవికృతవేషమెందుకు? (ఏడ్చును.)

సీత: అత్తా! నాకాంతున కేవేష మచితమో నాకు నదియే యర్హము. ప్రాణ నాథా! మునికాంతాపరిచర్యాలాభము నాకింతదనుక లభింపకపోవుటచే నిట్టిపవిత్ర వసనముల నెట్లు ధరింపవలెనో నాకనుభవములేదు, ఏమిచేయుదును?

రామ: అమ్మా! నీకోడలి కీవసనమును గట్టించెదవా?

కౌస: (గుండెలుకొట్టుకొని) అయ్యయో! నాతండ్రీ! నాతండ్రీ! నీవివాహము వేళ మధుపర్కము లిచ్చుసమయమున జానకికి బంగారుచీరఁ గట్టించిన యీ చేతులు తిరిగి సీతమ్మకు యీనారగుడ్డ నెటులఁ గట్టఁగలవు! ఈ చేతులతో నాకన్నులఁ బొడుచుకొందును గాని యీ ఘోరపాపమును నేను జూడలేనురా! (ఏడ్చును)

కైక: (తనలో) రామపట్టాభిషేకమహోత్సవ మనుభవించు. అనుభవించు.

లక్ష్మ: అమ్మా! నీవైనజానకీదేవి కీయుపకారమును జేయఁగలవా? (ఏడ్చును)

సుమి: నావలనఁ గాదు నాతండ్రీ! (ఏడ్చును)

లక్ష్మ: ఓ కేకయాత్మజా! ఓకరుణోదధీ! నీవు మనస్ఫూర్తిగ నిచ్చితివి గాన జేతులార నీవే కట్టుము.

కైక: ఛీ! ఛీ! యేమిప్రేలితివి? నేను నీవదినెకు బట్టలుగట్టించుటకు దాసి నను కొంటివా? ఊడిగపుతొత్తు ననుకొంటివా? నీకుఁ గనులులేవా? నోటికిఁగావరమా? రాజమాతనైన నన్ను నన్నిట్టులాడెదవా?

రామ: తమ్ముడా! తొందరపడకు. అమ్మా! క్షమింపుము. జానకీ! ఇప్పటి కిది నీపై గప్పెదను. చేతనైనట్లు తరువాతఁ గట్టవచ్చును లెమ్ము (పైనఁ గప్పును)

కౌస | సుమి | అహో! అహో! (ఏడ్తురు.)

కైక: ఇఁక నన్నియాడుపనులు నీచేతనే కానున్నవికావా? ఈపదునాలుగు వత్సరములు నీవు చేయు మహోద్యోగ మేమున్నది.

వసి: కేకయరాజపుత్రీ! ఏమి యీవేడబములు! ఏమి యీపట్టుదలమాటలు! యాజ్ఞవేదికసంభవయుఁ ద్రిలోకపావనియునగు సీతాదేవికి వల్కలధారణ మేల? అదికాక మునివృత్తియొక్క రామభద్రునకేకదా నీవు కోరితివి?

కైక: రామభద్రునికిఁ గోరితివి గాని సీతకు వలదనిచెప్పితినా?

వసి: అట్లైనను జానకీదేవికిఁగూడ నప్పుడే యేలకోరక పోయితివి?

కైక: అనవసరముగఁ గంఠశోష మొనర్చుకొని మీరిప్పుడు లేనిపోని ధర్మశాస్త్రాక్షేపణమును జెప్పి యిటుల హాస్యాస్పదముగ నిరోధింతురని నేనప్పుడెఱుఁగక పోవుటచేతఁ గోరలేదు. మీఁదబడవైచినది బట్ట కాని పాము కాదు గదా! పోవునది వనమునకు గాని మరణమునకు గాదుకదా! సంసారలంపటుల మొదలుకొని సంగపరిత్యాగులవఱ కందఱి కిట్టికడుపుమంట యేల?

లక్ష్మ : గీ. పొడిచెదను, గోసెదను, జెరుపుదును, జీరు
దును, వేఁలది౯ జెప్పనను గొట్టక, నను నిటు ద
హింతువా ? రామచంద్రు బాధింతువా ? ము
నీశ్వరులను దిట్టింతువా ? యిదిగో ! కత్తి.

(తండ్రిపై గత్తిదూసి యురుకును.)

రామ-ఆ ! ఆ ! సౌమిత్రీ (అపును.)

సుమి: లక్ష్మణా! లక్ష్మణా! అదేమి? అదేమి ? నీ కెంత బోధించినను శాంతత రాదేమి ప్రారబ్ధమురా !

కౌస: రాఘవా ! తమ్ముని గట్టిగ బట్టుకొనుమా :

దశ: దేవీ ! పట్టుకొననేల ? రామభద్రా ! నాయందు దయగలవాఁడ వైన యెడల నీ తమ్ముని విడువుము. లక్ష్మణా ! నీ విప్పుడుకదా లక్ష్మణుడవై ప్రకాశించు చున్నావు ? రా! వెనుదీయక రా!

సీ. చండాఁలుడను, మదాంధుడ, జడుండ, గాం
తాజనతాలోలతాయుతుండఁ
బుత్రఘాతుకుఁడను భూభారదేహుఁడ
వధ్యుఁడ నైననన్ వధముసేయు
నాతఁ డేఁడీ! లక్ష్మణా ! తండ్రి! నీకింత
కాలంబునకు దయ గల్గె; నిదె కి
రీటము, లోకసంప్రీతిఁ జేసెదు రాము
తలనుంచు మిదె నాదుతలను వంచి

గీ. నాఁడఁ ! గానీ యెటులో చెప్పవాఁడు; విను ? శి
రంబు గిరగిరదొరలుచు రాముపాద
ములను బడవలె; తెలిసెనా ? మోడ్పుకేలు
పట్టితిని; ఊఁ; యిఁకాఁగ కట్బా యిదేల ?

ఏమి సౌమిత్రి ! ఊరకుంటివేమి ? తండ్రిమాట జవదాటదగునా ? సంకోచింపకు. ఏమి ? అటులూరక చూచెదవేమి ? పొమ్ము ! పితృవాక్యపరిపాలన మనునది నీయన్నకు జెల్లినది కాని నీవంటివానికేనా ? పోపో! నీవే వనమునకు ముందుగ బో.

లక్ష్మ: పితృవాక్యవ్యతిరేకమునకు నన్ను వనమునకు బొమ్మనినారు! పితృవాక్య విధేయత కిమహాత్ముని వనమునకు బొమ్మనినారు. ఇక మీపరిపాలనమున జెడ్డకు మంచికిభేద మేమున్నది.

రామః (అపవారించి) లక్ష్మణా!

గీ. తరణికులమున నుదయించి, తమ్ముడా! వ
సిష్ఠశిష్యుఁడవై వరమేష్ఠితుల్య
గాధిసుతుచేత దివ్యాస్త్రకాండ మంది
నందులకుఁ దండ్రిఁ జంపుటేనా? ఫలంబు

గీ. అందుపై నుత్తమామ్మికార్యాపరమ
పూత మైనట్టిముని వేషమును ధరించి
కాని; వృద్ధుఁడౌ మనతండ్రిగారిఁ జంపఁ
బూన, నీకు సరివడకపోయెనో కొ ?

గీ. ఈబ్రతుకుఁ గర్మమునఁ దరియింప నింక
నొక్కబ్రదు కిచ్చి, తలకొన్వతోద్గతులకుఁ
బ్రాపు మన మనుకొనుతండ్రిబ్రదుకు నూడఁ
బెఱికనుండి వాతనిమేలు మఱవఁ దగునె ?

గీ. దైవమును దూషణముసేయ దైవమోర్చు
కొనును కన్నట్టిదేవునిఁ గొడుకు పరిభ
వింప, భగవంతుడే సహింయింపఁడయ్య
కొడుకునకుఁ దండ్రి దైవాధికుండు కాఁడె ?

గీ. కల్లుద్రావినకంటె మైకమును జేయు
గాఢకోపా ప్తి నంటితివి కాని వెన్నో
బట్ట మెడఁజుట్టుకొని తండ్రిపాదములను
బడినఁగాని చూడను నీదువదన మింక.

లక్ష్మః (అపవారించి, లెంపలు వైచుకొని) రామచంద్రా! బుద్ధి పొరబడినది క్షమింపుము.

రామః (అపవారించి) నిన్ను క్షమించునది నేనుగాను తండ్రిగారు.

లక్ష్మః (బట్ట మెడజుట్టుకొని)

గీ. ఒడలు కాలి, యనౌచిత్యంబు నుడిగి, బుద్ధి
గడ్డిఁదిని ప్రేలితిని దయాకంధి వగుచు

నన్నుక్షమియింపు తండ్రి! లేకున్నఁ దలను
బగులఁగాఁ గొట్టుకొని మృతిఁ బడయనుంటి,

దశ: లక్ష్మణా! ఇంతకుముందు నీవు తలచుకొనినపనికి నీవు శక్తిహీనుడ వైనపుడు నిన్ను క్షమింపకపోదునా? నీ వందుల కసమర్థుడవనే యూహింతును,

రామ: (అపవారించి) చూచితివా? దయాసముద్రు డగుతండ్రిగారిపై నీవెంత తీవరించితివి?

గీ. ఇంతచేసిన నిన్ను క్షమించెనీత
డిట్టి; తండ్రికొడుకులలో నెనయుభేద
మిదియె; పితపైని గలుగు సుతుదయకంటె
దండ్రికి సుతరాగము వేయితడవ లెచ్చు.

దశ: రామవనయానమును జూడవచ్చిన యోపురజనులారా! మీకందఱ కొక విజ్ఞాపనమును జేసికొనుచున్నాడ, దయతో నాలింపుడు.

వసి: దశరథా! అతివిచారమున మునుగదగదు.

దశ: గురువర్యా! విచారహరణమునకే ప్రయత్నించుచున్నాను. ఓ మహా జనులారా!

సీ. శ్రీరామపట్టాభిషేకంబు సేవింప
వచ్చినమీకంటఁ జిచ్చుఁబెట్టి
నాఁడఁ, బాపాత్ముడఁ నను వధించినఁ బాప
మంటదు; చంపుడీ! యార్యులార!
ఊరకుంటి రిదేల? యొక్క చేపాటిక
ఱ్ఱయునైన వైవఁగారాదె? యెన్ని
ఱాళ్ళున్నవట; నొక్కఱాతిని విసరి వా
ర్ధకకంపమానశిరంబుఁ నూడఁ

గీ. గొట్టరాదె? పెద్దకొడుకు నెట్టయెదుటఁ
జచ్చుభాగ్యము నొందంగనిచ్చి యతుల
సుకృతమును గట్టుకొనరాదె? చూతు రేల?
మీరు! మీరు! మీరును మీరు! మీరు మీరు. (ఏడ్చును)

(నేపథ్యమున) అంతపని మావలనగాదు. సర్వతంత్రస్వతంత్రురాలైన కైకేయినే యందులకై వేడుకొనుము.

సుమం: మహాప్రభూ! క్షమింపుము. జనుల మహాకలకలమంతయు దగ్గెను గాని యెవ్వడో యొకడు జనసంఘమునుండి కానరాకుండ నిట్టివంకరమాట ననినాడు.

దశ: తప్పేదియులేదు. వానిమాట వంకరకాదు. దానిబుద్ధి వంకర; నాచేష్ట వంకర.

రామ: ఓజనులారా! మీకు నమస్కారము. నాతల్లిదండ్రుల నెంతమాత్రమును దూషింపకుడు. వారు సత్యశీలురు. సత్యపరిపాలనమునకై కన్నపెద్దకొడుకునైననన్ను త్యజించుచున్నారు. ఇట్టి మహాసాహసకృత్యము మీలో నెవ్వరైన జేయగలరా! మావంశంబున బూర్వమెన్నడో హరిశ్చంద్రు డొనర్చినాడు. ఇట్టి సత్యమూర్తియైన వృద్ధచక్రవర్తిని లక్షజిహ్వలగొనియాడుటకు మాఱుగా నిందించుచున్నారా? ఓజనులారా! ఇప్పుడైన దప్పు గ్రహించుకొందురా?

(నేపథ్యమున) రామభద్రా! మహావైభవసమన్విత మహారాజ్యపదవి నత్యుచ్ఛ్రియముగ నుండవలసిన నీవు కాఱడవిలో నతినీచమైన నిర్వైభవస్థితి నుండవలసి వచ్చిన దని దుఃఖముచే నటు లంటిమి, క్షమింపుము.

రామ; ఓ మహాజనులారా!

సీ. సృష్టియంతయు నొక్క చిత్రనాటక మిందుఁ
గల్గు పాత్రములలోపలను భూపుఁ
డని ఘనతయు భృత్యుఁ డని న్యూనతయును లే
దింతైన; వాఁ డీతఁ డితఁడు వాఁడు
కాలానువశమునఁ గావచ్చు; నెవ్వఁ డే
వేషానఁ దనకథ వినికి బాగు
గాఁ జేయు నాతఁడే ఘనుఁడు; సామాజికుల్
దేవత ల్మనకు; నాభూవరసుత

గీ. వేషమైనది; మునికథ వినికిఁ జేయ
నుంటిఁ బైయంకమున! నింతె యుర్విజనుల
బ్రదుకు! గందమొ బుగ్గియొ స్వామి యొక్క
గంతిడి తెరదాఁటి చనుటకంటె గలదె?

వసి: ఆహా రామభద్రా! వైరాగ్యమూర్తివై ప్రకాశించుచున్నావు.
కౌస: నాయనా! నాయనా! ఎంతబుద్ధిమంతుడవోయి నాయనా! (ఏడ్చును)
దశ: రామభద్రా!

గీ. జనులు కొందఱు చంద్రాస్తసమయసుందు
జత్తు, రేను జావను రామచంద్ర! నీవు
వనికిఁ బోవుదనుక; మృతిఁ బడసి దుఃఖ
శాంతినొందెద, వెంటనే చనుము వనికి. (ఏడ్చును)

కౌస-సుమి: రామ రామ రామా!

రామ: (అపవారించి) సుమంత్రుడా! నీవుపోయి రథము మంగళవాద్య హార్మ్యముక్రింద నుంచుము మేమిప్పుడే వత్తుము. మాతండ్రిగారి దుఃఖమును నేను జూడ లేకున్నాడను.

సుమం: చిత్తము. (నిష్క్రమించును.)

రామ: సీతా! లక్ష్మణా! మీరిద్దఱు నావెనుక నుండుడు. గురుమాతాపితలకు ప్రదక్షిణ మాచరించి నమస్కరింతము. తమ (అటుల చేయుచున్నారు.)

గురూత్తమా! నమస్కారము. తమ శ్రీపాద దర్శనస్పర్శనలాభము నాకు దిరిగి యెన్నడు కలుగునో?

కైక: (తనలో) అప్పటికాయన, నీవు. బాగుగా నున్నయెడల బదునాలుగు సంవత్సరములకు.

వసి: రామభద్ర! చిరాయురస్తు.

గీ. మునులు నీదివ్యమంగళతనువు ననుభ
వింపఁ దపియింత్రు వారిఁ దరింపఁ జేసి
యసురులను జంపి దేవకార్యము నొనర్చి
శ్రీసనాథుఁడ వగుచు వచ్చెదవు వేగ.

రామ: అమ్మా! నమస్కారము.

(అపవారించి)

సీ. నను నింతగాఁ జేసెనని నీవు సవతిని
జిత్తమందైన దూషింప కమ్మ
వార్ధకమున సుతవ్యథ గల్గు తండ్రిని
జేతులఁ బెట్టి పోషింపు మమ్మ
భరతరాజును రామభద్రుఁగా భావించి
వేడ్క నాతనిని దీవింపు మమ్మ
ననుఁబాయుచింతచే నవయు నాభృత్యుల
వ్యథ మాన్పి కృపను గాపాడు మమ్మ

గీ. కానసంధ్యల మన్ననమస్కారములను
నిందు గ్రహింపు మమ్మ "నాచందమామ"
యనుచు నీ వనుచుండు సీతను, మఱి నను,
బరమవైరాగ్యవృత్తిని మఱవు మమ్మ.

కౌస : (కౌగలించుకొని) నాతండ్రీ! నాతండ్రీ! వెళ్ళెదవా? వెళ్ళెదవా? అయ్యయో! ఈమాయపట్టాభిషేకము మూలమున నిన్నటి సాయంకాలమునుండియు నీకు భోజనముచేసి మఱి పోరాదా నాయనా?

వసి : కోసలాత్మజా! ప్రయాణ మగువారి సటులు కోరగూడదు.

సుమి : అక్కా! ఈదినమున జంటిపిల్లలు పాలు ద్రావలేదు. పశువులు నీరు త్రాగలేదు.

రామ : అమ్మా! తిరిగి నమస్కారము, నాకు సెలవిమ్ము.

కౌస : నాతండ్రీ! నీకులదేవతలు నిన్ను రక్షింతురుగాక! వస్తులగు మహర్షులు నిన్నుఁ గాపాడుదురుగాక! విశ్వామిత్రదత్తములగు దివ్యాస్త్రములు నిన్నోమునుగాక! బ్రాహ్మణమహాశీర్వాక్యములు నిన్ననుసరించుగాక; సూర్యాదిగ్రహములు, పంచభూతములు, షడృతువులు నిన్ను సర్వదా రక్షించుగాక; నాయనా! వెళ్లెదవా? అయ్యో! సీతమ్మతల్లీ! నీకు నిట్టిగతియేనా? ఓ భూదేవీ! పవిత్రురాలగు నీకూతు నాకొడుకునకు జేసికొని కోడలిని వనమునకు బంపించుచున్నాను. ఈ నిర్భాగ్యురాలగు నాకు గొంచెము దారి యిచ్చి పాతాళమునకు ద్రోయవా?

సీత : అత్తా! నమస్కారము, విచారింపకుడు పోయివచ్చెదను. సెలవిమ్మ మాగదిలో నుండు రెండు పెంపుడుచిలుకలను మీరు రక్షించుచుండవలెను.

కౌస : అయ్యో! ఈచిలుకపిల్లలజంట నింక నెవరు పోషింతురే మాతల్లీ! నీభర్తకు సహాయురాలవై సుఖముగా నుండుము. వనములో గానబడిన చిత్రవస్తువు లవి యివి చెప్పని తలును నీ[illegible] గోరుమా లక్ష్మణా! చిన్నతనము నుండియు రా[illegible] స[illegible] కలిసి [illegible] చే నీకు [illegible]ప్పుడు రామభద్రునితోడి గతియే పట్టె.

[illegible] : (కైకేయివంక తిరిగి) అమ్మా నమస్కారము. నేను సెలవు తీసికొందును.

కైక : నే నిదివఱకే యిచ్చితిని గాదా!

రామ : భరతు డీసమయమున లేకపోవుటచే నాకు జింతగనున్నది. ఆతడు వచ్చినపిదప నేను వనవాసమునకు బోవుచు నాతని బిగ్గగౌగిలించుకొంటి నని చెప్పుము. ఇదియగాక యీమాటగూడ జెప్పుము.

గీ. "రాముఁ డనువాఁడు జన్మించి ప్రాకటముగఁ
బెరిఁగె నను మాటయే కాని వృద్ధుఁడైన
తండ్రికి గారిబఋణముఁ దీర్చ దగినపెద్ద
కొడుకత వీవాడు; తమ్ముఁడా! గుణవరేణ్య!"

సీతా : అత్తా! నమస్కారము పోయెదను.

కైక : సరే.

రాము : (సుమిత్రయొద్దకేగి) అమ్మా! నమస్కారము.

గీ. శ్రమపడఁగ లేవు వలదని చాల చెప్పి
నను వినక కూడవచ్చుచున్నాఁడు తమ్ము
డితని నాప్రాణసమముగా నెన్నుకొందు
నమ్మ దయయుంచి వెడలుట కానతిమ్మ.

సుమి : రామభద్రా! సీతాసమేతుడ వైన నిన్నే నేను వదలుకొనుచుండగ నిక లక్ష్మణుని వదలుకొనలేకుందునా?

వసి : (తనలో)

గీ. కనినసుతునికై సవతిబిడ్డను వనమున
కనిపె కైక; సవతి బిడ్డకయి కనినసు
తుని వని కనిపెడు సుమిత్రతుల్యహీన
చరిత నీనాటిఁ గొనియాడ సాధ్యమగునె?

కైక : (తనలో) మూలకు రెండు వర్జ్యములవలె సుమిత్రకు గొడుకులిద్దఱు కాదా? ఒకడు పోయిన నింకొక డుండును. విచారమేల?

సుమి : నాయనా! రామభద్రా! ఈ కోటలో ననేకులు స్త్రీలు పురుషు లున్నారు. పురుషులలో లక్ష్మణునికి, స్త్రీలలో జానకికిమాత్రమే మిమ్ము సర్వదా కాంచి సంతసించుభాగ్యము తటస్థించినది. మాతాపితృతుల్యులగు మీపరిచర్య జేసి కృతార్థతను బొందుటకే లక్ష్మణుడు మీవెంట వచ్చుచున్నాడు. లక్ష్మణా! నీవు నోటిదురుసుదనపువాడవు! జాగ్రత్తసుమా!

సీత : అత్తా! నమస్కారము. పోయెదను.

సుమి : సీతమ్మతల్లీ! రాఘవునికంటె లక్ష్మణునికంటె నూర్మిళకంటె నీవే నాకు ప్రియతరపదార్థమ వైతివేమితల్లీ!

రామ : (దశరథునియొద్దకువచ్చి) తండ్రీ! (పైకిమాటాడలేక చేతులుజోడించుకొని కన్నీరు గ్రుక్కుకొనును.)

దశ : (కౌగలించుకొని) అడవికి బోవుచు నీవు నాకు నమస్కరించితివి· ఐహికవాంఛాలేశదూరుడ వైన నిన్ను నేనేమని దీవింపగలను?

సీ. సర్వమంగళగుణసంపూర్ణుఁ డగునిన్ను
నరుఁడు దేవునిగాఁగ నరయుఁగాత!
రామనామము భవస్తోమభంజనదివ్య
తారకనామ మై తనరుఁగాత!
పదిళొంపలునులేని పల్లెనైనను రామ
భజన మందిర మొండు వరలుఁగాత!
కవు లెల్ల నీదివ్యకథ నెన్నొ రీతులఁ
గొనియాడి ముక్తిఁ గైకొంద్రుగాత!

గీ. ఎట్టివ్రాతయు శ్రీరామ చుట్టఁబడక
వ్రాయఁబడకుండుఁగావుత! రామవాక్య
మనినఁ దిరుగని దని యర్థ మగునుగాత
రామ! రామ! రామా! రామ! రామ! రామ!

వసి : (తనలో) ఆహా! ఎట్టి పరమార్థవాక్యములు వినబడెను!

గీ. బ్రహ్మసంధాయిదివ్యర్షి వదనతటిని
యతశూన్యత వేదాంతరాశి యుబికి
నట్లు శ్రీరామునిశ్చలధ్యానపరుఁ డీ
తనిముఖమునుండి సత్యాకృతి జనించె.

లక్ష్మ : తండ్రీ! నమస్కారము. నాకు సెలవిండు.

దశ : వత్సా! రామభద్రసేవచే కృతార్థుడవైతివి. పొమ్ము.

సీత : మామగారూ! నమస్కారము.

దశ : రామభద్రా! సీతమ్మకు గప్పిన యీ నారచీర ముందుగ దీసివేయుము. తల్లీ! జానకీ ఈ పదునాలుగు వత్సరములు నీకు గావలసి యాభరణములును వసన

ములునుగూడ రథముపై నుంచుమని సుమంతునితో జెప్పితిని. నీవు పీవతి ననుసరించి కృతార్థురాలవు గమ్ము. (సీతకుగప్పిన నారచీర రాముడు తీయును.)

రామ : ఓమాతాపితృపరిచారకులారా! నేను మిమ్మెప్పుడైన ప్రామాదికముగ ననాదరణ మొనర్చియుండినయెడల మీరు నన్ను మన్నింపుడు.

(నేపథ్యమున నేడ్పు) అయ్యో! అయ్యో! అయ్యో! రామా; రామా; రామా-

రామ....పరిచారకులారా! దుఃఖింపకుడు. లక్ష్మణా! సీతా! పోదుమురండు.

(నిష్క్రమింతురు)

దశ

కౌస రామా! రామా! (ఏడ్చుచు గూడబోవుదురు)

సుమి

వసి : దశరథా! ఆగుము.

దశ : నన్ను గాదు రాము నాగుమనుము! రామా! రామా! ఆగవా? ఆగవా? సుమంత్రుడా! రథ మాపవా? రామునితో నొక్కమాట జెప్పెదను. అయ్యో? (బిగ్గఱగ) రామా! రామా! (క్రిందబడును.)

వసి : (దశరథుని లేవనెత్తి) రాజేంద్రా! ఊఱడిల్లుము.

దశ : సుమంత్రుడా నారామచంద్రుడేడీ?

వసి : దశరథా! నేను వసిష్ఠుడను; మనసు గుదుటబఱచుకొనుము.

కైక : భగవానుడా! మీవలన నేమగును? నేను నాయింటి కితనిని దీసికొని పోయెదను. (దశరథుని సమీపించి) నాథా! నాథా! రమ్ము! పోవుదము.

దశ : రామునియొద్దకేనా!

కైక : ఇంకను ఱాము డెక్కడ?

దశ : నీవా? దుష్టురాలా! రాము నడవికి బంపి నీయింటికి నన్ను దీసికొని పోనుంటివా? ఛీ! పొమ్ము. గురూత్తమా! ఎచ్చట నున్నావు?

వసి : ఇదిగో-ఇక్కడ.

దశ : నే నతిశీఘ్రముగ మృతినొందుట నిశ్చయము. నాశవమునైన నీపాపాత్మురాలంట గూడదు. మీరీసంగతి జ్ఞప్తియుంచవలెను. కన్ను లగపడుట లేదు. కౌసల్యయేదీ?

కౌస : నాథా! ఇక్కడ నున్నాను.

దశ : నేను రామునతో బోలేకపోయినను నాదృష్టి యాతని ననుసరించి పోయినది అదియే నాకు మహాదృష్టము నన్ను నేయంతఃపురమునకు దీసికొనిపొమ్ము: నీకు నమస్కారము.

కౌస : చిత్తము. (పట్టుకొని నడిపించును) అపనారించి భగవానుడా। మహా రాజుగారికి దృష్టిపోయినట్లే మతిగూడ చలించినట్లున్నది. ఈయనప్రాణము లీదిన మున నిల్చునని తోచదు. మీ రాశ్రమమునకు బోక మాపెంకానే రండు.

వసి : అలాగే (తనలో)

గీ. మూఁడవగ్రహంబు మూరకలంబునకుఁ దగిన
దండులో మొండియైన ఛాయాగ్రహంబు
నంతరము వచ్చు దీనిసాహాయ్యమునను
నిశ్చయముగ మారక మది నెఱవుఁగాదె."

అని గోచారరీతి నతిసన్నిహిత మగు తనమరణమును నిన్ననే యీమహారాజు సూచించినాడు గోచారరీతి నట్టి సన్నివేశముగల గ్రహములే సంసారరీతిని ప్రత్యక్షములై గృహగతములయినపుడు మారకమునకు సంశయము గలుగునా? ఈ మూడవగృహిణియే యామూడవగ్రహము మనసుచేతను గాత్రముచేతను మొండియైన యీ మంధరానాయక ప్రచారికయే తద తరచ్ఛాయాగ్రహము. దీని ప్రోత్సాహముచేత నేయీమహాగ్రహముమారకము జేయుటకు సమర్థమైనదియైవెలుగుచున్నది

దశ—గీ. ఒడలు దెలియక పడఁతిపై బడతిపై బడఁతి నిటులు
కట్టుకొని, కామినైయె యాఁ గాడిదయను
కూఁతపై గన్నసుతునిఁ బోఁగొట్టుకొనిన
ముచ్చు దిక్కుమాలినచావుఁ జచ్చుఁగాదె?

వసి : (తనలో) ఉపశ్రుతికూడ నట్టులేయైయున్నది. (ప్రకా) రాజేంద్ర పోదుమురండు. (నిష్క్రమింతురు.)

ఇది పంచమాంకము

—

శ్రీ

పట్టి భంగరాఘవ మను

# పాదుకా పట్టాభిషేకము

## షష్ఠాంకము

ప్రదేశము:—అయోధ్యలో నొకవీథి

[ ప్రవేశము.—సురుచిరుఁడు ]

సురు : మామిడికాయల నూరుగాయ బెట్టుకొనుట యెఱుగుదుము కాని

(నేపథ్యమున) ఏమయ్యా! తెల్లవాఱకుండనే యూరుగాయను గుఱించి తల పోయుచున్నావేమి?

సురు : ఓహో! నీ వెవడవు? ఇటురా!

(భ్రమరకుడు ప్రవేశించును)

భ్రమ : ఏయో యనుచున్నావు?

సురు : ఏమియున్నది! మామిడిగాయల నూరుగాయబెట్టుకొనుట యెఱుగుదుము కాని మనుష్యుల నూరగాయ బెట్టుకొనుట యెచ్చటనైన వినియుంటిమా?

భ్రమ : హరివరీ! దశరథుని మృతకళేబరమును తైలబాండ నిక్షిప్తముజేసి నందుల కిటు లనుచుంటివా?

సురు ; కాయరీతిగా వేసినట్లా? లేక ముక్కకొట్టి జాడికెక్కించినారా?

భ్రమ ; మృతులను, మఱి యందుపై బూజ్యులను బొత్తిగ దూషింప గూడదు.

సురు : నేనుమాత్ర మెఱుగనా? కాని మహారాజుగారీ కుంబీపాకములో నొక సంవత్సరమైన నుండదలచినట్లైనా?

భ్రమ : అయ్యో! అంతకాల మిక నెందులకు?

సురు : పాత్రితబడి పద్యమున కక్కఱకు వచ్చుటకు.

భ్రమ ; భరతుడు మాతామహగృహముమండి యింతకుబూర్వము రాకపోవు టచేత నిన్నిదినము లీరాజకళేబరమున నగ్నిసంస్కారము లేకపోయెను. ఆభరతశత్రుఘ్నులిప్పుడే వచ్చిరి. కాని తెల్లవాఱినతరువాత దహనాదిక్రియలుజరుగనైయున్నవి.

సురు : భరతునికి పితృమరణమునుగూర్చి యింతకు బూర్వమందు దెలిసెనా?

భ్రమ : కోటలో ప్రవేశించువఱకు దెలిసియుండదు.

సురు : రామలక్ష్మణవనవాసము గుఱించియో?

భ్రమ : తెలియదు.

సురు : అటులైన నిప్పుడు భరతు డేల వచ్చినాడు?

భ్రమ : తత్క్షణమున బయలుదేఱి రావలసిందనిమాత్రమే వసిష్ఠుడు భరతున కొకలేఖ బంపినాడు.

సురు : పోనీ! తేపు శ్రాద్ధక్రియ లారంభమై మనకు దాన దక్షిణాదులు దొరకును.

భర, ఆ - కాని, నీవింక నాలుగుగడియలరాత్రి యుండగనే వీధివెంట దిరుగుచున్నా వేమి?

సురు : ఆప్రశ్నము ని న్నడిగిన నీవేమిచెప్పెదవో?

భ్రమ ; ఉషఃకాలస్నానదీక్ష యున్న నేను సరయూనదికిబోవుచున్నాడ

సురు : నే నీ గ్రామవాసినిగాను. దశరథమరణమును విని నేటికాలమునకు జనులభాగ్యము పండినదని సంతసించి సంభావనకై యాశించి, యిచ్చటకువచ్చి యీ దినమున దహింతురో తేపు దహింతురో యని గ్రుడ్లు మిటకరించుకొని యేడుదిన ములనుండి కనిపెట్టుకొనియున్నాను.ఏమో! చచ్చినవారితోపాటు సంభావనకువచ్చిన వారు చచ్చు టెందులకని పొరుగూర శ్రమపడలేక ప్రాణము సివిగి స్వగ్రామమునకు బయలుదేఱినాడ. ఆజీవునకు ఘటవిముక్తియైనది. కాని, యాతని ఘటమునకుమాత్ర మింతదనుక యాయావాంతర ఘటవిముక్తికాకుండ వసిష్ఠబ్రహ్మజాగ్రత్తపెట్టినాడు.

భ్రమ : తేపు కానున్నదికాదా ?

సురు : అటులైన నదృష్టవంతులమే. భరతుడు వచ్చినతరువాతనైన గాకుండునా? ఈసరి కాతడు తనతల్లిగారిని జూచుచుండును గాబోలు!

భ్రమ : ఆ - నేను నదికి బోయెదను.

సురు ; ఇప్పటినుండి చేయుపని యేమున్నది? అక్కడ రాజవాహనము లేచునరికి నిక్కడ నేను లేపలేకపోదునా? కాన నేను నదికి బోయెదరు.

(నిష్క్రమింతురు)

ఇది విష్కంభము.

ప్రదేశము :— కైకేయి యంతఃపురము

[ప్రవేశము : భరతుఁడు, కైకేయి]

కైక : (కన్నుల నీరుగ్రుక్కుకొని) ఏమియులేదు నాయనా !

భర : (ఆందోళనముతో) నాయనగారికి జబ్బుచేసినదాయేమి?

కైక : అబ్బే ! రుగ్మతయేలేదు నాయనా !

భర : పోని. బాగుగనున్నారుగద !

కైక : లేదు. రోగమెంతమాత్రమున్నట్లేలేదు. వార్ధకముచేఁ గలిగిన నీరస మనుకొంటిమి. అబ్బబ్బ ! తగనిపలవరింతలుగద! దేహమున జ్వరము లేదు. అదేమి ప్రారబ్ధమోకాని, యాదినము మొదలు దృష్టి సంపూర్ణముగ నశించినది.

భర : ఏదినపుమొదలు !

Gr 9036

కై : రోగమారంభమైనదినముమొదలే నాయనా !

భర : అమ్మా ! ఇంతకుమునుపు రోగములేదంటివి, ఇప్పుడు రోగారంభము నుండియనుచుంటివి! నాకుఁ గంపమెత్తుచున్నది; చెప్పుము.

కైక : పెద్దలకు రోగమేమిటితండ్రీ ! (కన్నులు నీరుగ్రుక్కుకొనును.)

భర : నేను గనులఁజూచుట కింతవఱకు మానాయనగారితనువు నిలిచియున్నట్లే కద !

కైక : ఆ! ఉన్నది. ఏమియుండుటతండ్రీ! అదియు నొకయుండుటలోనిదేనా తండ్రీ ! (కనుల నీరుగ్రుక్కుకొనును.)

భర : పోనీ ! నేను చూచివత్తును. కూడరమ్మా.

కైక : నాయనా ! తొంగరపడకుము, ఇప్పుడు మనముపోయిన లాభముండదురా తండ్రీ ! (కనుల నీరుగ్రుక్కును.)

భర : ఏల ?

కైక : వసిష్ఠభగవానుడు వచ్చినగాని మీతండ్రిని పైకి దీయువా రెవ్వరు ? (ఏడ్చును.)

భర : పైకిదీయుటయేమి ? ఎక్కడనుండి ?

కైక : తైలఘటమునుండి నాయనా ! (ఏడ్చును.)

భర : (గుండెలుకొట్టుకొని) అయ్యో ! అయ్యో ! తండ్రిగారు మరణించారా ? అయ్యయ్యో ! తండ్రీ ! (యేడ్చును)

కైక : తండ్రీ ! ఊరకుండుము. చెప్పినమాటవిని యూఱడుము, విచారించిన లాభ మెంతమాత్రమును లేదు.

భర : హా! తండ్రీ! నీ వెంతశీఘ్రముగ నెగిరిపోతివి ! నీయవసానకాలమున నీయొద్ద నుండలేకపోయిన నేనును శత్రుఘ్నుడు నెంత దురదృష్టవంతులము!

కైక : నాయనా ! ఆవిషయమున నన్నదమ్ముల నలుగురియదృష్టము లొకతీరు ననే యున్నవి.

భర : అదేమి ? రామలక్ష్మణులు తండ్రిగారియొద్ద లేరా ?

కైక , ఉన్న నింతకర్మమేల? తండ్రీ! మహారాజును తైలఘటమందుంచనేల?

భర : పితృధర్మమును నాకీవిధమునసైన గలుకజేయుట కాతని కిటులుచేసి రనుకొనుచున్నాను.

కైక : అదియు గొంత నిజమే.

భర : హా ! రామలక్ష్మణులుగూడ నాయగారియొద్దలేరా? ఎక్కడకుబోయిరి.

కైక . సీతతోగూడ వనమునకు.

భర : వేటకై పోయిరికాబోలు ! హాతండ్రి ! హాతండ్రీ! ఇంతవాండ్రైననల్వురి పుత్రులను గాంచి తుద కెంత దిక్కుమాలిన మరణమొందితివి! (గుండెలుకొట్టుకొని) చితిపైనబెట్టుటకు నొక్కసుతుడైన నొద్దలేకపోయెనా ? హా తండ్రీ మేమెంత నిర్భాగ్యులము !

కైక : కర్మసూత్రమిటు లుండ నెవరేమి చేయగలరు?

భర : పితృసముఁడైన రాఘవుడు సీతాలక్ష్మణులతో నిప్పటికైన వనము నుండి తిరిగి వచ్చినట్లేకద!

కైక : వనమునకు బోయినవారెప్పటికైన రాకపోదురా? వేళకు లేకపోయిరని యేడువవలయునుగాని,

భర : నిజమే-తల్లీ! నాకిక ప్రభుడు తాతతుల్యుడునైన శ్రీరామచంద్రుని పాదముల గొలువబోయెదను సెలవిమ్ము,

కైక : [చేతులు పట్టుకొని] ఉండవోయి నాయనా! ఒక్కనిమసము నిలువ రోయి తండ్రీ!

భర : [కూరుచుండి]

గీ. నలుగురము నొక్కచోట గౌగిళుల గూడి
తలలు నేలగొట్టుకొని "హా! తండ్రి! తండ్రి!

యిటుల చేసితే యంచు గొంతెత్తి యెక్క-
పటిని దలపోసికొని యేడ్వనలదె తల్లి!

కైక : సరేకాని, ఎంతవిచారించినను మీతండ్రిగారు తిరిగి వత్తురా? వారికేమి పెద్దలు. మహాదృష్టవంతులు, అనాయాసత్యక్తజీవులు, అననుభూత దైన్యభావులు మీకుమాత్రమేమి తండ్రీ! విద్యాబుద్ధు లు నేర్చినవారు, వయసువచ్చినవారు, భార్యలతో గాపురములనుచేయుచున్నవారు, రాజ్యతంత్రమునెత్తిపై బడిన నవలీల నిర్వహింప దగినవారు. ఎటువచ్చినను పసుపుత్రాళ్ళు తెగిమూలగూర్చున్న మాకర్మముగాని మీ కేమి నాయనా! కంటతడివెట్టకు — ఇటుచూడు!

భర : (తలయెత్తి) ఏం?

కైక : మీతండ్రిగారు తనప్రాణప్రయాణకాలమున నాతో రహస్యముగ నే మనిరో నీ వెరుగవుగదా,

భర : అమ్మా! వినుటకు సంభ్రమపడుచుంటిని.

కైక : చెప్పెదను దుఃఖమును వదలివిను. మరణించినవారితో మరణింతుమా? నాయనా! ఏదో ముందుమార్గము జూచుకొన నక్కరలేదా?

భర : ఎందులకీ యుపోద్ఘాతము చెప్పరాదా?

కైక : "భరతుడు రాకపోయెనే"! యని పరితపించుచు మహారాజు ప్రాణములు విడిచి నాడుసుమా? [కన్నులనీరె గ్రుక్కుకొనును.]

భర : భరతుడు — చచ్చుభరతుడు — వచ్చిననేమి? రాకపోయిన నేమి? కర్మాధికారియు దండ్రిగారి కుత్తమలోకములనీయ సమర్థుడును జగదేకపవిత్రుడును —

కైక : అబ్బ! అట్టి రాఘవుడు మంచివాడేనయ్యా! కాదన్నవారెవరు? అతనిమాత్ర మనేకవిధముల యవసానకాలమున సర్శింప లేదని చెప్పితినా? ఎవరి యోగ్యతాయోగ్యత లెటులున్న దండ్రిగారికి నల్వురిపుత్రులయందు సమానానురాగమే కదా! అందుపై — మరియొకమాట — నీవెఱుంగని దేమున్నది? — నాసుతుడవగుటచే నీయందు ప్రేమ మత్యధికము. "భరతుడు వచ్చియుండినయెడల భరతుడు వచ్చియుండినయెడల నాముత్తెమంత కార్యముకూడా నాచేతి మీదుగ జరిగించి కృతార్థుడనై పోవుదును గదా" యని యావృద్ధ మహారాజు కన్నుల నీరుపెట్టుకొని —

(కన్నీరు గ్రుక్కును.)

భర : ఆస్వల్పకార్య మేదియో చెప్పుము.

కైక : నాకు జెప్పకతీఱదు. నీవుబుద్ధిమంతుడవైన నీవు వినకతీఱదు. నాయనా! ఇటురా! నాతొడపై గూరుచుండుము,

భర : అక్కరలేదు. ఇట గూరుచుందును.

కైక : నాయనా! నేనుజెప్పినట్లు మాతృభక్తిగలవాడవై యాచరించెదవా?

భర : ఆచరణమునకు ముందుచెప్పుట యావశ్యము కాదా? అదేదో ముందు చెప్పుము; చేయదగియున్న దరువాత జూచుకొనవచ్చును. (తనలో) ఏదో కీడు మూడెనని మనసులో నాందోళనము కలుగుచున్నది.

కైక : "చేయదగియున్న" యను సంశయమేల తండ్రీ! నీ తండ్రిగారి యవసానకాలఫలభ నీవలన నెఱవేర్పబడదగనిదై యుండునా? అనేకతీర్థముల సేవించి లెక్కలేని దానములజేసి' అమితోపవాసక్లేశమున నవసి, నిన్నుధరించి, నవమాసము నష్టకష్టములబడి మోసి, నిన్నుగాంచి, కుడిచేయి యెడమచేయియనక, నిన్నుబెంచి యింతవానినిజేసినతల్లి — నీవైశ్వర్యకాముడవై యనితరసాధారణ వైభవసమగ్రుడవై దీర్ఘాయుష్మంతుడవై, పరిపూర్ణయశస్సాంద్రుడవై, సంతానవంతుడవై, నీతండ్రిగారి బోలెజిరకాలము నీవు భూమిపై దేజశ్శాలివై యుండవలయునని యనేకదైవముల గొల్చు నీతల్లి —యైన నాచిరకాలమనోరథమును— నాతండ్రీ — నీకు నెఱవేర్పగూడని దగునా? అదిగాక దానినే తేవు వశిష్ఠభగవానుడు నీ కుపదేశింప దలచియున్నాడు. వారి యుపదేశము నిరాకరణార్హమైనదగునా? నీకు సందేహమేల?

భర : నాకొకందులకు సందేహము గలదు.

కైక : అదేది?

భర : అదేదిమో వెల్లడించుటకు నీకే సంకోచముగ నున్నట్లు నాకు గనబడుచున్నది. దానిని జెప్పుటకు నీకే నోరురానపుడు చేయుటకు నా కెట్లు మనసువచ్చునని సందేహించుచున్నాను.

కైక : (భరతుని సమీపించి కౌగలించుకొని) వెఱ్ఱివాడా! నాకు సందేహమేమున్నది? పసివాడవు గావున విశేషభారవహనమునకు జంకుదువేమో యని బుద్ధిగించితిని. చిరకాలమంత్రియై నిపుణుడైన సుమంత్రు డన్నిటికి నుండగ నీకు భయమేమి?

భర : (తొందరతో తల్లియొద్దనుండి యిటువచ్చి) ఆ! ఆ! అదేమి?

కైక : ఏమున్నది! భూప్రజలు నేటికి నీమూలమున దిరిగి ప్రభువును గలవారుగా దలచి కుతూహలమునున్నారు.

భర : (చెవిలు మూసుకొని) పాపము శాంతించును గాక! పాపము శాంతించునుగాక! ఇగదేకరక్షణదక్షుడైన రాముడో! సర్వప్రజానయనచకోరచంద్రుడైన రామచంద్రుడో! సర్వప్రజానయనచకోరచంద్రుడై రామచంద్రుడో!

కైక : అతనిని విసర్జించి నిన్నే పట్టాభిషిక్తునిజేయుటకు మహారాజు మనోరథము.

భర : (చెవులుమూసుకొని) ఎంతమాట వినుటకు బ్రతికియుంటిని। రామ రామ రామా। (ఏడ్చును) సర్వజంతు శాసనపటిష్ఠ మగు పంచాననము గలుగ మహారణ్యాధి సత్యమును గుక్కకొగ్గుదురా? ఆమహామహుని పాదుకలను మోయుట కంచె నా కర్హతలేదే। అయ్యయ్యో। అజానుబాహుడు, విశాలవక్షుడు. ఆకర్ణాంత నేత్రుడు, సమస్తసద్గుణసమలంకృతుడు; సర్వశాంత్రస్వతంత్రుడు; మహాత్ముడైన రాముడుండ-

కైక : "ఉండ" ననుమాట యేల ?

భర : (అమితమైన తొంతరతో) ఆ! ఆ! రాముడేలేడా? నాకు బ్రభుడేలేడా? నాపాలిటి భగవంతుడే లేడా ? ఇక నేనేల బ్రదుకుదును ?

(తల నేలగొట్టుకొనబోవును?)

కైక : ( ఆపి విసుగుదలతో ) రాము డిక్కడ నున్నాడా ? వనములో నున్నాడు. అతని పురప్రవేశమునకు బెద్దయుపరోధముండుటచేతనే నిన్నేలుమని నే నేడ్చితిని,

భర : వనమునుండి రాఘవుడింటికి వచ్చునని నీవింతకు ముందుచెప్పితివికాదా?

కైక : నేను చెప్పలేదు,

భర : రాముని పురప్రవేశమున కభ్యంతరమున్నదా. ఏమీ।

గీ. అఖిలజనులకు నాజ్ఞనీయంగ గలుగు
స్వేచ్ఛగలను దైనరాముని కాజ్ఞయేల ?
సర్వపగమాత్ర కలనప్రశస్తమైన
కాలమున కొండు పరిమాణలీల కలదె ?

(గుండెలు కొట్టుకొని) రామునికి రాష్ట్రత్యాగశిక్షయే ? దప్పుజేయుటయే యెఱుగని రామునకు —

కైక : పదునాలుగు వత్సరములు.

భర : రామా। రామా! రామా! (ఏడ్చుచు) మా నాయనగారే యిట్టిశిక్ష విధించినారా ?

కైక : అందులకు మఱెవడు సమర్థుడు ? అతని కాశిక్షతోపాటు నీకు రాష్ట్రసి బహుమానము.

భర : హరిహరీ! హరిహరీ! మాతండ్రియేమి? ప్రాణాధికుడైన రాముని విడుచుటేమి? నేనునమ్మను! కోపస్వభావపు! సపత్నీ కాంతాసూయావిలచిత్తపు! నీవే యావృద్ధ రాజేంద్రుని ప్రోత్సాహపరచి యింత కొంపతీసి యుందువు. నిజముచెప్పు! నిజముచెప్పు రామా! రామా! [నెత్తిగొట్టుకొని యేడ్చును.]

కైక : రాజ్యమో రాజ్యమో యని యేడువక రామా! రామాయనియేడ్చెదవేమి?

భర : ఓదుర్మార్గురాలా! ఓకోపస్వభావురాలా! ఈదిక్కుమాలిన రాష్ట్రమును నా నెత్తిన గట్టనెంచి, యా నవనీతతుల్యాంతఃకరణుని అసుందరాకారుని, అకృపా సముద్రుని, అసుగుణరాశిని, సతీసోదరులతో వనమున కనుపుమని నాతండ్రికి దుర్బోధన మొనర్చితివా? హా వక్రహృదయా! ఎంత ద్రోహమొనర్చితివి?

కైక : వయఃప్రాదుర్భావ సంపన్నుడైన రాజపుత్రున కుండదగిన రాజ్య వాంఛ నీకుండదని యెరుగక రాముని పాదములు గొలుచుటతప్ప అంతకంటె నితరోద్యోగ మక్కఱలేని బానిసపందవు నీవని యెరుగక, నన్ను రాజమాతనుజేసి నా సవతులను కటాక్షవీక్షణముచే నూరడించు మహాధికారము నా కొసగ జాలనినాడు పుట్టువవని యెరుగక, నేను నీతండ్రిని ప్రోత్సాహపరచి తత్పూర్వదత్తములగు రెండువరములను—రామవనవాసము మొదటిగ, నీపట్టాభిషేకము రెండవదిగ—వాంఛించి గ్రహించితిని. నీవు రాష్ట్రిను సంపాదించుకొనలేవు సరేకదా! నే నార్జించియిచ్చిన దీసికొనలేవు గూడనా?

భర : ఛీ! ఛీ! పాపాత్మురాలా! ఛీ! ఛీ! క్రూరురాలా! యీరాజ్యమును నేనపేక్షించితినని నీతో నెన్నడైన జెప్పితినా? ఆహా! పరాత్పరుడా! అట్టి నీచోద్దేశగంధము లేశమైన నా హృదయమున స్వప్నమందైన బ్రవేశించెనా? ఓ దురాశాపాతకినీ! నాకు లేనిరాజ్యవాంఛ నీ కేల? అయ్యో! అయ్యో! సర్వజ్యేష్ఠుడై సమంజసగుణ నికురుంబుడైన దాశరథి యేలవలయునుగాని...... (ఏడ్చును)

కైక : రాముడు జ్ఞానసంపన్నుడు. అందువలన రాజ్యార్హుడు కాడు, నీకుతెలియదు. నీ క్షేమము కొరకే చెప్పుచున్నానువిను. తర్వాత జ్యేష్ఠుడవు నీవే!

భర : అసందర్భప్రలాపినీ! జాత్యంధతాదులు రాజ్యార్హతన ప్రతిబంధమని యపూర్వ ధర్మశాస్త్ర నిర్ణయోపన్యాసమును జేయుచుంటివా? ఇట్టిద్రోహవాక్యములాడిన నీ నాలుక యెందులకు ఖండఖండములై రాలిపోలేదోయని నే నేడ్చుచున్నాను.

కైక , తరువాత సావకాశముగ నేడువవచ్చును. ఇప్పుడీమాటనువిను. పితృకర్మము నీవిప్పుడు చేయనున్నావు? శ్రాద్ధక్రియ లేపుత్రు డొనర్చునో యాతడే తండ్రిసొత్తున కధికారి—తెలిసినదా?

భర : (చెవులు మూసికొని) నోరు గట్టిపెట్టుకొనుము. నేను నీమాటలను వినను. (గుండెలు కొట్టుకొని) అయ్యో! అయ్యో! అట్టి మహాదారుణ వాంఛలను

వెల్లడించి రఘువంశమునకు నాయకమణి యైనవానిని ద్రెంపి యడవిలో బాణవైచి పెనిమిటిని జంపి, లోకులచేతను గన్నకొడుకుచేత నవియివి యనరానితిట్లు తినుచు, నింను సిగ్గులేక యిటులు ప్రేలుచు:—నీ వింక బ్రతికియుంటివిగాని.... ఛీ! రఘు వంశ నాశని! ఛీ! నరరూప బ్రహ్మరాక్షసీ! ఛీ! మహాపాతకినీ! నీ మొగము చూడ దగునా? (తలత్రిప్పుకొనుచు) తీక్ష్ణస్వభావుడైన సౌమిత్రికత్తి కెరగాకుండ నీ వింక నెటులు బ్రతికితివో తెలియకున్నది.

కైక : అతడు నన్నుజంపువాడా? నే నే చచ్చుటకుసిద్ధముగ నున్నాను. ఇక నొక్కమాటచెప్పెదను వినుము. నీవుసింహాసనమెక్కి బోరగిల పడవలయునని నే నీ పని జేయలేదు. రామచంద్రునిపై ననురాగ లోపముచేత జేయులేదు. కౌసల్యపై నాకు గలవైరమును దీర్చుకొనుటకే చేసితిని. ముమ్మాటికి జెప్పుచున్నాను. ఇందువలన గాగాలసినంత నింద నాకు గలిగినది. ఇట్టిస్థితిలో నీవు రాజ్యము నే నంగీకరింపని యెడల నాయపకీర్తికి బదునాలుగు భువనములు చాలవు. కాన, గన్నకొడుకువైనందు లకు రాజ్యము నంగీకరించి, నాయప్రతిష్ట బాపి, నామర్యాద కాపాడుము. లేదా చచ్చు టకు సర్వసిద్ధముగ నున్నాను.

భర : నాకు రాజ్యమక్కఱలేదు; అక్కఱలేదు అక్కఱలేదు. సరేకదా! జటావల్కలములు మునివేషధారినై రామనామసంస్మరణముజేయుచు నడవికిబోయి యాశ్రీరామచంద్రుని పాదముల నెత్తిపై బెట్టుకొని, యిటకుదీసికొనివచ్చి సింహాస నముపై బెట్టుదును. ఇదియే నా సంకల్పము.

కైక : అటులైన నే నగ్ని ప్రవిష్టనై చావవలసినదేనా?

భర : అటు అయిననునరే, గొంతుక కురిబోసికొని చచ్చిననరే! ధనపు సం చులు పైన బడవేయించుకొని నలిగిచచ్చిననరే.

కైక : (ముందుకు నడచి) ఇంతవాడవైన పుత్రుడవు నీవుంపగ జంపుకొను టలో గల శ్రమమునన్ను నీవు పొందనిచ్చుట న్యా.. మా? నీవే చం..ము. కానీ.... చంపవేమి? చంపవేమి?

[నేపథ్యమున] అన్నా! నీయెడ నేనుచేసిన మహోపకారమునకు "చంపవేమి చంపవేమి" యని నన్ను వెంనాడించుచున్న యీ.. ట్లు ప్రోత్సాహపఱతునా?

కైక : (అటుచూచి తనలో) అదేమి? అయ్యో! మంధర భయాక్రాంతయై పర్వెత్తుకొని వచ్చుచున్నది.

భర : "చంపవేమి? చంపవేమి" యని మీదిమీదికి వచ్చుచున్నావు. నిన్ను జంపవలసినదే లోకోత్పాతకారిణి వగుదనిన్ను జంపిన పుణ్యమేకాని పాపములేదు. కాని, యటులుచేసినయెడల రామునకు నాపై నేమికోపము వచ్చునోయని యింతగా సందేహించుచుంటిని. నీవలన బాధపడుచున్నరాముడే నీకిప్పుడు ప్రాణరక్షకుడయ్యెను.

[నేపథ్యమున] ఛీ! తుచ్ఛురాలా! ఇంతచేసిన నిన్ను ననేక సహస్ర ఖండములుగ గోసెదను.

కైక : (తనలో) అమ్మయో! "నిన్నును" అనుచున్నాడు. ఈకోపస్వభావుడు నన్నుగూడ ఖండించు నేమో? భరతునికివలె శత్రుఘ్నునికి మాత్రము రామభీతి యుండకపోవునా? కాన, భయము లేదనుకొందును.

భర : అదుగో! తమ్ముడు శత్రుఘ్నుడు. మందరను వెంటాడించి వచ్చు చున్నాడు. ఇదియంతయు మంథరాదుర్బోధనము వలన గలిగినదని తెలియుచున్నది.

[మంథర ముందుగ పర్వెత్తగ శత్రుఘ్నుడు ప్రవేశించు]

శత్రు—గీ. భైరవైతన్మహోపద్రవనమున కాది
కారణంబైన యీవక్రగాత్రి నిదిగొ
కండకండలుగా గోసి కావు కావు
మనెడి కాకుల కెరబెట్టుదును మహాత్మ!

భర : అహో! తెల్లవారినదికాబోలు! లక్ష్మణానుజా! కావు కావు మని కాకులే యఱచుచుండ మనము కావకుండుట న్యాయమా?

మంథ : భరతరాజేంద్ర! శరణము జొచ్చితిని. సీతాముని వారింపుము.

భర : పలుగాకి! జగదేక వంద్యుడగు రామభద్రుడుండ "రాజేంద్ర" యని నన్ను బిలుతువా?

శత్రు : తప్పుజేసిన దీని నుపేక్షించుట తగవుకాదు. కావున జంపుటకు సెలవిండు. (మంథరజుట్టు బట్టుకొనబోవును.)

మంథ : అమ్మయ్యో! తల్లీ! నీవైన రక్షించు. (కైకచాటునకు బోవును.)

భర : అనుజా సెలవిచ్చుట నీ వెంతసమర్థుడవో నేనునంతే సమర్థుడను. మనయన్నగారినిగూర్చి ద్రోహ మొనర్చిన దీనిని శిక్షించునెడల నాకృపాసుడునికి మరిప్రైం గోపమునచ్చునేమో? మనకా తండ్రిలేడు. తండ్రితరువాతతండ్రియైన జ్యేష్ఠ భ్రాత యుచ్చుటలేదు మనకు దండ్రిగారైనను, అన్నగారైనను, తల్లియైన, గౌసల్యాదేవియే! దనినిగూర్చ యామెయనుజ్ఞ యెట్టులో యటు లాచరింపుము.

కైక: (అపవారించి) కులటా! "భరతుఁడు రాజ్య మంగీకరింపఁడుసుమా" యని నే నెన్నివిధములఁ జెప్పిన వినక న న్నీతంత్రమున దింపి నాగొంతు గోసితివి! ఛీ! పో!

మంథ: (అపవారించి పోవుచు) ఇంతవిశ్వాసవతివైన నీగొంతు గోసిన పాప మేమున్నది? (పోబోవును.)

శత్రు: నేనురాకుండ నీవెచ్చటకు బోయెదవు? కౌసల్యాదేవియొద్ద కీడ్చు కొని పోయెదను! రా! (ఇద్దఱును పోవుదురు.)

[నేపథ్యమున] శత్రుఘ్నుఁడా! భరతు డెచ్చటనున్నాడు?

[తిరిగి నేపథ్యమున]

వసిష్ఠభగవానుఁడా! కనుటచేతనే తల్లి యని పిలువదగిన కైకేయియొద్ద నున్నాడు. మీరు దయచేయవచ్చును.

భర: మహానుభావా! గురువర్యా!

[వశిష్ఠుడు ప్రవేశించును.]

గీ. కనినతండ్రిని నామూలమునను జంపి
యడవి కగ్రజు ననుగూర్చి నెడలగొట్టి
బ్రదికియుండియు జచ్చిన పడతియెదుట
జచ్చియు బ్రతికియుంటిని సంయమీంద్ర! (ఏడ్చును)

వసి: కాలగతి కెవ రేమిచేయగలరు? విచారింపకుము.

భర: నాకు మతెందులకు సంతాపములేదు కాని, యొకందులకుమాత్ర మున్నది.

వసి: ఎందులకు?

భర: గీ. ఈకుటిల చేయుకుట్రలో నేనుగూడ
నుంటి నని రాముచిత్తమం దుండునేమొ!
యనుచునేడ్చెద నదె సత్యమైన నిట నె
యిపుడె యీజీవములు త్యజియించువాఁడ.

అపుడు మీ రొకమహోపకారము సేయవలయును.

గీ. నాదుతండ్రిశవముతోడ నాకళేబ
రమును దమ్మునిచేత భస్మమునొనర్చ

బంచి, భరతుడు శ్రీరామపాదదాసు
డంచు వని కేగి వచియింపు మతనియెదుట.

(ఏడ్చుచు గాళ్లపై బడును.)

వసి: వత్సా! రామానుజా! లెమ్ము. రామభద్రునకు నీపై నెంతమాత్రము కాలుష్యములేదు. జడువకుము.

[నేపథ్యమున] జడువకు, మంధరా! జడువకు! నేను వచ్చుచుంటిని. శత్రుఘ్నుడా! ఆగు!

భర: (తనలో) మాఅమ్మ కౌసల్య చిరంజీవితోడను మంధరతోడ నిక్కడకే వచ్చుచున్నది. అయ్యయ్యో! ఆమెమొగ మెటుల చూడగలను?

కైక: (తనలో) నేను దీనిని జూడకుండ లోనికి బోయెదను.
(నిష్క్రమించును)

[కౌసల్య, శత్రుఘ్నుడు, మంధర, ప్రవేశించుచున్నారు.)

కౌస: శత్రుఘ్నా! మా ప్రారబ్ధమంతయు నిటులుండ మధ్యమున నిది యేమి చేసెను? దాని నేమియు బాధింపవలదు. విడిచిపెట్టుము.

శత్రు: అమ్మా! సరే! మంధరా! అయినదేదోయైనది. నీకు శిక్షకూడ దప్పినది. నీవు రామభద్రునియెడల నంతద్రోహ మేమికారణమున జేసితివో చెప్పుము.

మంధ: శుభముచూచి సహించుట నాస్వభావము కాకపోవుటచేత నటులు చేసితిని. పట్టాభిషేకము ముందుగ భరతునికి స్థిరపరచిన నిటు లభ్యంతరపెట్టుదాననే.

భర: ఛీ! దుర్మార్గురాలా! నీగొంతుక కోయదగినదే. పో. పో.
(త్రోసివేయును.)

మంధ: (పోవుచు) నాదికాదు. నన్నింతవంకరగ జేసినచ్చలకు దేవునిది.
(పోవును.)

భర: అమ్మా! నమస్కారము.

కౌస: కైకేయిపుత్రా! నిన్నిప్పుడు నే నేమని దీవింపవలసియున్నది? ఇక్ష్వాక సింహాసనమున బట్టాభిషిక్తుడవు గమ్మని మీయమ్మయే దీవించెను. నీదారి కడ్డు కలుగునేమో యని నాకొడుకును నట్టడవులకు ద్రోచి నీ నిర్విఘ్నరాజ్యప్రాప్తికి మీయమ్మయే దీవించినది. నీవుగాని నీతల్లిగాని మావంటివారియెడల నిరాదరణమును గనబఱిచినయెడల నిది మీకు నీతికాదని చెప్పి మందలించుటకు బైన

వృద్ధరాజేంద్రుడైన లేకుండ నాతనిని లఘుమార్గమున బరలోకమున కనిపి నీయభీష్ట పరిపాలన నిరంకుశత్వమునకై మీయమ్మయే దీవించినది. నీవు—

భర: (గుండెలు కొట్టుకొని) ఎంతెంతమాటలు వినుటకు బ్రదికియుంటిని. హా! హృదయమా! ఇంకను పగులకుంటివా? హా? రామా! రామా! రామా! రామా!

(మూర్ఛిల్లును.)

శత్రు: (విసరి) అగ్రజా! లెమ్ము.

భర: (లేచి కౌసల్యకాళ్ళపై బడి) అమ్మా! అమ్మా! దోషగంధశూన్యుడ నైన నన్నేల దూషింతువు? నేను చంటిపిల్లవాడనై యుండగ నీవు గరములలో బెట్టి న న్నాడించినపుడు నేనెంత పాపరహితుడనో యిప్పుడుకూడ నంతేయను కొనుము. రాఘవునియెడల నాకు గలభక్తి నీవెఱుంగవా? తండ్రిగా రెరుగరా? ఈ మహానుభావు డెరుగడా? జను లెరుగరా? నా మహాదోష మేదనగ—కైకేయి గర్భమున బుట్టుటయే—

గీ. రామవనవాసమునకు శిరఃప్రకంప
నమును జేసిన ఖలుడు చండాలుడగుత!
గురుమహాద్రోహి యగుగాత! నరకలోక
శాశ్వతావాసశిక్షార్తి సహితు డగుత!

గీ. అట్టిద్రోహి స్వపుత్త్రిమాంసాశి యగుత!
ప్రబలతనుదీర్ఘరోగదుర్భరమహార్తి
భరితు డగుగాత! నోటను పురుగులుపడి
సకలహైన్యంబు భరియించి చచ్చుగాత!

ఇంకను—.

వసి: హరిహరి! చాలుచాలు. వత్సా! నీ నిర్దోషత యెవరెఱుగనిది? కోవ లాత్మజా! నిష్కల్మషహృదయుడైన భరతు ననుగ్రహింపుము.

కౌస: పుత్త్రిలారా! ఇటురండు. నాయనలారా! మనము శ్రీరామచంద్రుని జూచు టెన్నడు? (ఏడ్చును)

భర: అమ్మా! నాసంకల్పము నీవు వినలేదుకాబోలు! నే నిప్పుడు జడలు, నారలు ధరించి. తాపసవేష మూని, వనములకేగి శ్రీరామచంద్రుని పాదముల సేవించి, యిచ్చటకు దీసికొనివచ్చి, సింహాసనముపై నధిష్ఠింపజేయుదును.

కౌస: పుణ్యాత్ముడవైన నాతండ్రీ! మమ్ముగూడ నీతోడ దీసికొనిపోయి కృతార్థులను జేసెదవా?

భర: అమ్మా! చతురంగసేవాసమేతులమై యందఱమునుపోయి యా మహాత్ముని సమస్తవైభవములతో నిటకు దీసికొనివత్తము.

వసి: సరే. కాని తెల్లవారినది. ఈరోజున దశరధునకు దహనాది పైతృక క్రియలు జరుగవలసియున్నవి. కాన నీవుపోయి స్నానాది కృత్యములాచరింప వలయును.

భర: భగవానుడా! రామచంద్రుడు రానైయున్నాడుకదా! ఇంతకాల మీవిదుల నాపిసవారిక గొన్నదినములువాత్ర మాపగూడదా! జ్యేష్టపుత్రుడు పరమమిత్రుడైన యా మహానుభావుడే యీకృత్యముల నాచరించుట కర్హుడుకదా! దయచేసి నామనవి నంగీకరింపుడు.

వసి: వత్సా! ఇక నాపుట కవకాశములేదు.

కౌస: ఇన్నిదినము లాపుటచేతనే నిందకుబాత్రులైయుంటిమి. ఇక నాప గూడదు తండ్రీ!

భర: మీయిష్టానుసారమే యాచరింతును. నట్వారము చేయదగిన యీ యుత్తరక్రియలు మా యిద్దరిచేతులతోడనే కడతేరవలననదా? హా! ఎంత ప్రారబ్ధము తటస్థించెను.

వసి: విచారింపకులే. అందరము లోనికిబోయి తగు పత్రియత్నములో నుందుము రండు.

భర: సరే. ఈకృత్యము లైనపిదప మనమందరము వనవాసియైనరాముని జూచుటకు బోవుట నిశ్చయమేకదా!

పసి: అభ్యంతరమేమి?

భర; రామభద్రు డిప్పు డడవిలో నేయాశ్రమ నమీపమందున్నట్లు వార్త వచ్చినది?

పసి: గుహానివాసమును, భరద్వాజాశ్రమమునుదాటి, చిత్రకూటమునకు బయలుదేఱదలచిరని సుమంత్రుడు చెప్పినాడు.

భర: మనము భరద్వాజులవారివలన నాజాడలను గ్రహించి చిత్రకూట మునకుబోయి యచ్చట రామభద్రుని జూతము. సరే, ఇప్పటికి లోనికి రండు.

(నిష్క్రమించుదురు)

ఇది షష్ఠాంకము

శ్రీ

పట్టభంగరాఘవ మను

# పాదుకాపట్టాభిషేకము

## సప్తాంకము

ప్రదేశము :—చిత్రకూటపర్వతసమీపారణ్యభాగము.

(ప్రవేశము : రాముడు, సీత)

రామ: ఇక్కడ ! తమ్ముడా ! ఇటు రా.

లక్ష్మ: (ప్రవేశించి) అగ్రజా ! మహాప్రమాదము సంభవింపనై యున్నది. సీతాదేవి నెచటనైన భద్రపఱచవలయును. పర్ణశాలలోని యగ్ని జల్లా రుపవలయును. మనమిద్దరము కవచితాంగులమై, ధనుష్పాణులమై, యామహా సైన్యమును పర్వతాగ్రమెక్కి మార్కొనవలయును. తొందరపడుడు. ఇదిగో యీసాలవృక్షశాఖపై మీధనుస్సునది. తీసికొనుడు. (రామునకిబోవును) సందేహించుచుంటిరేల ? మన కన్నిటికంటె జానకీరక్షణమే ప్రధానము గావున మీరు తత్సంరక్షణార్థ మామెయొద్దనేయుండుడు. నే నొక్కడనుబోయి—

రామ: (నవ్వుచు) పోయి యేమిజేసెదవు?

లక్ష్మ—గీ. అధికదుర్నిరీక్ష్యోగ్రహార్యక్షు సేన
వితతిపైబడి యేమికావించు, నీర
సేంధనాళిపైబడి యగ్ని యేమిసేయు
నదియెసేనపై కుటికి యే నాచరింతు.

రామ : ఆసేనయెవ్వరిదో బాగుగ గనిపెట్టితివికద !

లక్ష్మ—గీ. గ్రుడ్లు మిఱుమిట్లుగొలుపగ గోవిదార
కేతు వీక్షించినాడను; గేకయాత్మ
జాత్మజుడు దుష్టబుద్ధి సౌహార్ద్రహీను
డుద్ధతుడు క్రూరు డిట వచ్చుచున్నవాడు.

గీ. న్యాయహీనత మాతృచండాలురాలి
మూలమున గన్న ప్రాభవమును ఘటింత

బలపఱచుకొంటకై వనవాసయుతుల
మనల ద్రుంగవచ్చెను దుష్టజనుడు నేడు.

సీత: వత్సా! సౌమిత్రీ! శ్రీరామభక్తుడైన భరతు నటు లనెదవేల?

లక్ష్మ: (చేతులు జోడించుకొని) అమ్మా! క్షమింపుము. అగ్రజా! సెల విమ్ము.

రామ; తొందరయేమియు లేదు. అనవసర మగుకోపము జల్లార్చుకొనుము.

లక్ష్మ! అగ్రజా! రామభద్రా!

గీ. ఇక సహింపను సహియింప నిపుడె వాని
క్షాత్రవధమును జేసి దుశ్చేష్టురాలి
కైకతల ద్రెంపి యసిలతాగ్రమున బెట్టి
మెఱపు మెఱచిన ట్లేను గ్రమ్మఱెద నయ్య,

గీ. పక్షిపతి శ్రీమహావిష్ణు పరమదైవ
ములనహించినగతిని మిమ్ములను మూపు
పై గదియించి నీ వెక్కంగనలసినట్టి
సింహపీఠంబుచేరువ జేర్తు వేగ.

రామ: లక్ష్మణా! భరతు డిచ్చటకువచ్చుట నిశ్చయమేకద!

లక్ష్మ: వచ్చుటయేకాదు, చచ్చుటకూడను.

రామ: (ఉస్సురనుచు) కఠినోక్తులేల? భరతుని గైకేయిని హింసించి నే జేయవలసినదేమి?

లక్ష్మ: మీరు జగదానందకరముగ రాజ్యమేలవలయును.

రామ: రాముడు ప్రతిజ్ఞాభంగపరాయణుడని నీ యభిప్రాయమా? రాజ్యాశాభూయిష్టుడని నీవనుకొనుచుంటివా? మాతా భ్రాతృ శిరస్సోపానములమీదుగసింహాసన మెక్కునంతటి క్రూరాత్ముడని తలంచుచుంటివా? మదీయసోదరానందసౌఖ్యములకే నేను సింహాసన ముపేక్షించితినని నీ వెరుగవా? లక్ష్మణా? ఇంత వెఱ్ఱివడితివేమి? చిరంజీవియైన భరతుడే వచ్చుచుండ గాఢాలింగనమును జేసికొనవలయును గాని కత్తులేల? గటారులేల? కవచములేల? ఈ కారుమాటలేల? అదిగాక యాతడు మనల జంపుటకే వచ్చునట్లు నీకెవరు చెప్పిరి?

లక్ష్మ: క్షమింపుము. ఈసేనల కలకలములేల? ఆయాశ్వికుల ధావనములేల గజపంక్తులచే నీ మట్టడులేల? ఇదిగాక

రామ: నీవు భ్రమించునంతసంకులము నాకేమియు గానబడుటలేదు. సరే. భరతుడు రామశిరచ్ఛేదమునకే వచ్చియుండు ననుకొందుము; అతని కేమిలాభము?

లక్ష్మ: (చెవులు మూసికొని) మహాత్మా ! నే నిట్టిదారుణవాక్యములు విన గలనా

రామ: భరతుని జంపుదునన్న కఠినతరవాక్యములు నేను వినగలననియే నాచెవినివైచితినా ?

లక్ష్మ: రామచంద్రా ! భరతుడు దుర్మార్గుడు. కావున నటులు పలికితిని

రామ; భరతుడు నన్ను జంపుటకు వచ్చునేమోయని నీవు సంశయపడుట చేత నతడు దుర్మార్గుడును భరతుని జిత్రవధము జేసెదననియు, గైకేయీశిరమును ఖడ్గాగ్రమున బట్టెదననియు నీవు నాయెదుట నస్సంశయముగ గంఠోక్తిగ బలుకుట చేత నీవు సన్మార్గుడవునా? కాని నన్ను జంపుటచే నతని కేమిలాభమో నీ వూహించిచెప్పుము.

లక్ష్మ: రాజ్యమందు మరింత నిరంకుశము నిరబ్యంతరముగ స్థిరపడుటకై

రామ; అనగ నేను వనమునుండివచ్చి తన్ను రాజ్యహీనుని జేయకుండనని యేనా ?

లక్ష్మ: (చేతులు జోడించుకొని) చిత్తము.

రామ: నాయందు విశేషానురాగముగలవాడై నన్నే పితృతుల్యునిగ నన్నే గురుసమునిగ భావించి సేవించునమృతమయాంతఃకరణు డైన బరతునిపై నీ కవోహమున్నట్లే బరతునికి నాపై నవోహమున్నందుకు్యెంచుచుంటివా? బరతుడు నన్ను నత్యహీనునిగ భావించుచున్నాడా? నన్ను లుబ్ధాగ్రేసరునిగ నూహించు చున్నాడా ? మహనీయగుణోత్తరుడై తనకంటె నాకీమట్టి యెక్కువయని నిశ్చ యించు కొనినాడా! సౌమిత్రీ? రాజ్యముపైన మరింతస్థిరపడుటకంటివి ! కొంచ మైన స్థిరపడినట్లు నీకెట్లు తెలిసినది?

లక్ష్మ; పట్టాభిషిక్తుడు కాకుండనే యీసైన్యములపైనింత యనర్గళాధికార మెటులుకలిగియుండును?

రామ; తండ్రిగారీసైన్యముల నిచ్చుటచేత గొనికొని రాగూడదా ?

లక్ష్మ: రాజ్యమునుగూడ దండ్రిగారటులే యొసంగకుందురా ?

రామ; ఇచ్చిన నాతడేల స్వీకరించును ?

లక్ష్మ; రాజ్యవాంచచేత.

రామ: అట్టివాంఛ యాతనికుండెనని యేమాత్రమైన వెల్లడిచేసినట్లు నీవు వినియుంటివా?

లక్ష్మ: అవసరమురానిదే యేల వెల్లడించును ?

రామ: ఆతని దుర్మార్గత నీ వింతకుమున్ దేవిషయముననైన వినియుంటివా?

లక్ష్మ: స్వప్రయోజనావసరము రాకముందు జనులెల్ల సన్మార్గులే. అది లభించునపుడే యోగ్యతాయోగ్యతలు తెలియవలసినది.

గీ. అర్హతయె లేక పై బడినట్టి రాజ్య
మేల భరతుండు త్యజియించు నిద్ధరీతి
వశమయిన సార్వభౌమత వదలుకొనగ
నందఱును రాము లనుకొంటివా మహాత్మ !

రామ: అందరును రాములు కాకపోవచ్చును గాని మీరందరు రామానుజులే కద! నీకు నాయం దింతభక్తియుండగ భరతునికిమాత్ర మన్యథాయుండునా? అటు లెన్న డుండదు. తాతగారి గృహమునుండి యయోధ్యకువచ్చి యంతయును విని తల్లినినిందించి పట్టాభిషేక మొల్లక మనల జూచుట కిటకు భరతుడు వచ్చుచున్నాడని నా యభిప్రాయము.

గీ. నీ వహంకారివి, యసహంభావు డతడు
మతిస్వతంత్రుడ వౌదీవు, పరశరణ్యు
డతడు, నాయెడ మీకుండు గుణము లిటులు ప్ర
బలు, బరునియెడ భక్తిప్రపత్తు లటులు.

గీ. అట్టిపరమసాధుని, దయాయత్తచిత్తు
సరససద్గుణజాలు బ్రజ్ఞానశీలు
భరతు నేమైన జేసిన బలికిన, నవి
యెల్ల నాకొనర్చితివని యెంతు నేను.

గీ. భరతు నిందించి నను రాజ్యపదవిగొమ్మ
టంచు నింకొకసారి నీవాడు నెడల
భరతుతో జెప్పి యారాజ్యపదము నీకు
నతనిచే గట్ట బెట్టింతు నయ్య ! నిజము.

లక్ష్మ: మహాత్మా! మీ దాస్యముకంటె నాకు రాజ్య మెక్కువదికాదు.

రామ: నీకేకాదు; భరతునికిగూడ నట్టులే.

లక్ష్మ: అగ్రజా! అజ్ఞానకృతమగు నా ప్రసంగమును క్షమింపవలయును.

రామ—గీ. కోప మెంతవచ్చిన బంధుకోటి జంప
సాహసించుట తగనె ? నీసాటివారు

కొండఱున్న ద్రేతాయుగంబందె ప్రళయ
లీల జేయజాలుదురు కాబోలునయ్య !

సీత: (అపవారించి)నాథా! సౌమిత్రి లజ్జాసంతప్తచిత్తుడైనట్లున్నది. వెంటనే బుజ్జగింపవలయును.

రామ: లక్ష్మణా! భరతునిపై నీ కపోహము వదలెను గాన నేనే భరతుడనని యెంచి నమస్కారపూర్వకముగ గౌగిలింపుము.

లక్ష్మ: క్షమింపుము. (నమస్కరించును.)

రామ: (లక్ష్మణుని గౌగిలించి)భరతు డేవేషముననున్నాడో నీవుచూచితివా?

లక్ష్మ: నేను భరతుని జూడలేదు.

రామ: (నవ్వుచు) అలాగా? మనల జూచుటకును, దిరిగి పోవునపుడు పరమసుకుమారి యగు జానకిని దీసికొనిపోవుటకును మనతండ్రిగారే వచ్చుచున్నారేమో?

సీత: అబ్బ! నేను మిమ్ము విడిచివెళ్ళను.

లక్ష్మ: తండ్రిగారు వచ్చుచున్నట్లు నాకు దోచదు.

రామ: ఏల?

లక్ష్మ: ఆయన శ్వేతచ్ఛత్రాదిచిహ్నములు బొత్తిగా గనబడలేదు.

రామ: ఆ! కనబడలేదా? తమ్ముడా! ఏమైన కీడు మూడి యుండదుకదా! సీతా! మానాయనగారి జీవములగూర్చి నేను సందేహపడుచున్నాను. అప్పటికి భరతశత్రుఘ్నులైనవచ్చిరో చిరకాలసేవకుండైన సుమంత్రుడే సుతుడయ్యెనో?

సీత: అట్టి యుపద్రవము జరిగియుండిన మనకు వార్త రాకుండునా?

రామ: ఏమోకాని మనసు కలతనొందుచున్నది. మనము పోయి పర్ణశాలయొద్దనే భరతాదులను గలసికొందము. రండు.

గీ, అమ్మలను దమ్ములను జూతు నంచు ముదము
గలుగదేలొకో? కడుపులోపలను బెద్ద
జాయిపడె; నెట్టివార్త కర్ణముల బడునో ?
హేతుశూన్యార్తి యూరకే యేగ దెపుడు.

తమ్ముడా ఇటురా! (సీతా రామ లక్ష్మణులు పోవుదురు)

భర: (వెంటనే ప్రవేశించి) అగ్రజా! యెక్కడనుంటివయ్యా!

గీ. రామ ! రాఘవ ! రఘువీర ! రామచంద్ర !
రామభద్ర ! శ్రీజానకీప్రాణనాథ !

పుండరీకాక్ష ! లక్ష్మణపూర్వజ, యెట
నుంటివోయయ్య ! దర్శన మొసగ రాదె ?

గురూత్తమా! భరద్వాజులవారు సెలవిచ్చినప్రదేశ మిదియేయైయుండునా?

[వసిష్టుడు, సుమంత్రుడు, జాబాలి ప్రవేశింతురు]

వసి: అటులే తోచుచున్నది.

జాబా: తోచుటమాత్రమేకాదు, నిశ్చయముగ నిదియే. అదె చిత్రకూట పర్వతము! అదె భగవతి యగు మందాకిని!

భర: సుమంత్రుడా! బాగుగ పరిశీలింపుము. ఆ కొండచఱియయందలి సమప్రదేశమున నదె యొక కుటీరముకాదా!

సుమం: అది పర్ణశాలవలెనే కానిపించుచున్నది. సన్ననైన ధూమలేఖ దానిపై గనబడుచున్నది. నిత్యాగ్నిహోత్రులై పవిత్రులైన యే మునీశ్వరుల కుటీరమో?

జాబా; ఏ మునీశ్వరులో యననేల? మన మునిబాలకుల యాశ్రమమేయది. అటుపోవుదము రండు.

భర: సుమంత్రుడా! ఎందులకైన మంచిది. రామనివాసముచే బవిత్రమైన యీప్రదేశమునకు మనగుఱ్ఱములుగాని గజములుగాని యితరసేనలుగాని సమ్మర్దము గలుగజేయకుండునట్లు నీవుపోయి సేనాధిపతి కాజ్ఞాపింపుము.

సుమం: సేనాపతీ! వింటివా? భరతుని యాజ్ఞ.

[నేపథ్యమున] చిత్తము.

భర! ఓ చిత్రకూటపర్వతమా!

గీ. భవ్యరేఖాకలితరామభద్రుచరణ
పద్మసంస్పర్శనాఽఽకృత బడసితీవు
జనన మేదైన, నున్కి యెచ్చటనునైన
బుణ్యమునగాని కలదె సత్పురుషసేవ.

ఓ వనమృగముకారా!

గీ. అట నిటను రాముకొక్కె దేవులాడు చిటకు
వచ్చినను, గానబడ డని వనరుచుంటి
వనికి రాముడే మిమ్ముజూడ వచ్చినాడు
వసుధ మీభాగ్య మెన్న నెవ్వానికి వశమ్ము ?

మునీంద్రులారా; రండు! సీతాలక్ష్మణసమేత శ్రీ రామచంద్రా! ఎక్కడ నుంటివి? ఆ పర్ణశాలయొద్దకు బోవుదము రండు. సుమంత్రుడా! ఆశ్రమమునకు సమ్మర్దముగలుట యనుచితము కావున నీ విచ్చటనే యుండుము.

(భరతుడు, జాబాలి, వసిష్ఠుడు నిష్క్రమింతురు.)

సుమం: (అటు నిటు పరిక్రమించి) భరతాదులు పర్ణశాలకు బోయిరి. (అటునిటు చూచి) ఆహా! కౌసల్యాదేవి యొడిలో గూరుచుండి, భరతశత్రుఘ్నులను కౌగిలించుకొని, శ్రీరామమూర్తి పితృమరణమునకై యెటులు విలపించుచున్నాడో! ఎంత కరుణముగనున్నది. విచారింపవలదని జాబాలి వారిని వారించుచున్నాడు. శ్రీరామమూర్తి కన్నీరునింపగ సహింపలేక యాశ్రమమృగము లెట్లు డిల్లపడిచూచి బాష్పములు విడుచుచున్నవో!

గీ. నల్వురగుభ్రాత లరుగో ! స్నానంబొనర్చి
గురునికరముల నూతగా గొంచు నదిని
వెలువడిరి; మత్స్యమూర్తితో జలధినుండి
వెలికివచ్చు నాలుగు వేదములను బోలె.

ఆహా!

గీ. రామచంద్రుడు పితృదేవరాజి కంబ
కాంబుయుక్తముగా దర్పణంబు లొసగి,
పితృవరున కింగుదీపిష్టపిండ మెటుల
వదలుచున్నాడో? బాష్పసంభరితుం డగుచు

గీ. సర్వసాగర మేఖలానిర్వహణప
టిష్ఠుం డింద్రవైభవనిబిడీకృతుండగు
ప్రభునిక్రియలు నట్టడవిలోపలను జరుగ
వలసె; విధిబలిష్ఠతయెంతో తెలియ వశమె?

అరుగో! రామలక్ష్మణ జాబాలి వసిష్ఠ భరతు లిటకే వచ్చుచున్నట్లున్నారు! సీతాది స్త్రీజనము శత్రుఘ్న పూర్వకముగం బర్ణశాలం బ్రవేశించినది,

(రాముడు, లక్ష్మణుండు భరతుండు, వసిష్ఠుండు, జాబాలి
ప్రవేశించుచున్నారు.)

వసి- వత్సా -! రామచంద్రా! విచారింపకుము.

రామ. స్వామీ! యెఱుంగుదు!

గీ. తండ్రిగారి ప్రాచీనహితవరుఁ డైన
నిన్నుఁ జూచినతోనే నా నేత్రములకుఁ
దండ్రియే, కానఁబడినట్లు తలఁతు నేను
నిన్ను విడనాడిపోయెనే నీదుసఖుఁడు.

సుమం- (తనలో) యీ మహామహుని పూర్వభాషిత్వగుణ మీ సంతాపమున నైనఁ బ్రచ్ఛన్నము గాకయున్నది. (ప్రకాశముగ) వత్సా! దాశరధీ! పుత్త్రవంతులలో, నగ్రగణ్యుఁడైన మీ తండ్రిగారి ఋణముఁ దీర్చి కృతార్థుఁడవైతివి! మీ తండ్రి వెడలిపోయినట్లే నేనుగూడ శీఘ్రముగ మిమ్ము స్మరించుచుఁ బోవలయునని కోరుచున్నాను.

రామ—గీ. మద్రసానూనరుచ్యభక్ష్యములఁ దినిన
పితకు నింగుదీవిరచితపిండ మందఁ
జేసినాఁడఁ గ్రూరుఁడ నేమిసేయువాఁడ
నంతకంటెను గతి గల్గదయ్య! నాకు.

జాబా- వత్సా! అటులు విచారింపఁదగదు. పితృదేవతలనువా రనుభవించునది మన శ్రాద్ధగాని యన్నము గాదు.

వసి- రామభద్రా! జాబాల్యాదిగ మీ కులగురువులు, మీ ముగ్గురు తల్లులు, ముగ్గురు సోదరులు, సుమంత్రుఁడు సమస్త సైన్యము వనవాసి వైన నిన్ను సేవింపవచ్చిన యీ మహాజనులందఱిని బట్టిగూడ నరణ్యమే యయోధ్య యయినది మా కందఱ కిట మీతో నుండు భాగ్య మొసఁగవలయును. లేదేని పురమున మీరు మాతో నుండు భాగ్యమైన నొసంగవలయును.

జాబా: ఆ సంగతిని బ్రార్థించుటకే కదా పవిత్రుఁడైన భరతు డిటకు విచ్చేసెను. భరతుడా! అన్నగారితో మనవి జేసికొనుము.

భర! (లేచి, చేతులు జోడించుకొని గద్గదస్వరమున) అగ్రజా! రామచంద్రా! (పైమాటజెప్పలేక కన్నీరు గ్రుక్కుకొనును.)

రామ: వత్సా! భరతా! లేవనక్కరలేదు తండ్రీ! బయమేల. కూరుచుండి చెప్పుము.

గీ. యుష్మదభిసంధి యిప్పటికుంచు మటులు
వల్కలములేల? జటలేల? వనములేల?
సుఖవిసర్జనమేల? యీశోకమేల?
మునినిభు లివేల? చెప్పుము, ముగ్ధ తండ్రి!

జా: (తనలో) "యుష్మదభిసంధి యిప్పటి కుంచుమటు" అని రాముడని నాడు. భరతయాత్ర నిష్ఫలగునని తోచుచున్నది.

భర : అగ్రజా ! దాశరథీ !

గీ. నీకు వనవాసఖేదంబు, లోకమందు
బట్టజాలని యపకీర్తి, ప్రభునిచావు,
భరతరాజ్యప్రశంస, నాపాలిమృత్యు
వైనతల్లిచే గల్గెనయ్యా మహాత్మ !

గీ. ఆమెదుర్వాంఛ లేను నావంతయైన
నెఱిగియుండిన, యూహించియుఱకయున్న
స్వప్నమందైన విని యుపేక్షయొనరించిన
నిలువునను భస్మమై పోవవలయు నేను.

గీ. తాము వదలుటచే బవిత్రత్వ మేది
యున్న గతిలేనిరాష్ట్రమం దుండలేక
త్వచ్చరణపద్మకైంకర్యతత్పరతను
వచ్చినాడను; కృపను బ్రోవంగదయ్య !

గీ. ఈజటలు చీర లేమని పృచ్ఛజేసి
నారు; మీ కేదియుచితమో నాకు నదియె
తగును; గురువు లేదారి నరిగిరో పిల్ల
వార లాదారినే బోవలయు గాదె.

రామ: షెబాస్ ! తమ్ముడా ! నీమాటలు నీగుణసమీచీనతను సూచించుచున్నవి. పెద్ద లేర్పరచిన క్రమము బాలుర కవశ్యకర్తవ్యమని సర్వజనసమంజన మంజనమైననీతి నుపన్యసించితివి !

గీ. నాడు సభలోన మనతండ్రి, నా కరణ్య
వాసమును, నీకు రాజ్యవైభవ మటంచు
బలుకుమాటలను దల దాల్చి, వచ్చినాడ
గోదువ నీవంతు చెల్లించుకొనుము నీవు.

గీ. మనకు బ్రదుకిచ్చు మనతండ్రి మరణసమయ
వాంఛలను దీర్ప లేకున్న వారి మయ్యెన ..

మన బ్రతుకు లేల ? భువి నింక గన దలంచు
వారు బిడ్డలకై యాసపడుదురయ్య ?

భర: మహానుభావా ! మొదట దమ పట్టాభిషేకమని తండ్రిగారు స్థిరపరిచిరట. నావంటి మందభాగ్యుడు గలిగినందువలన మాతల్లికిబుట్టిన ద్రోహచింతచే ప్రోత్సాహ పెట్టబడి. సతీవశుడై వర్ణకఠోరమైన యీయాజ్ఞాద్వంద్వము నాతడు చేసెనట.

రామ: అతడేమిచేయగలడు ! మన మెటుల సత్యవాక్యమునకు బద్ధులమో యాత డుకూడ నటులే. మీతల్లి కసురయుద్ధకాలమున నిచ్చినవరద్వయమును నెర వేర్చి. స్వవాక్యవిఘాతమురాకుండ సత్యరక్షణమును జేసికొనభార మాతనియం దుండెనుగాదా?

భర: అట్టిచో గురుసన్నిధానమున దండ్రిగారుచేసిన తమ పట్టాభిషేకనిర్ణయమును మాత్రము తప్పిపోవుట సత్యహానికాదా?

రామ: అనుజా! నీ కొక్కసంగతి జెప్పెదను విను. నీ తల్లిగారిని వివాహమాడ బోవునపుడు మనతండ్రిగారిచ్చిన కన్యాశుల్కమేదో నీవు వినియుంటివా?

భర; అనతీయవేడెదను.

రామ; ఆమెగర్భమున బుట్టుపుత్రున కీ రాజ్యము నిచ్చెదనని మీ మాతామహునితో మనతండ్రి వాగ్దానముచేసెను. అట్టి పూర్వ రచితసత్యవాక్యవిరోధముగ దండ్రిగారు నా పట్టాభిషేకమును స్థిరపరచినను దానిని నెరవేర్పలేకపోయి నను సత్యహానిలేదు.

భర: (చేతులు జోడించుకొని) మనతండ్రి నా మాతామహునకు జేసినవాగ్దానము నాటిదికాదు. ఇక్ష్వాకుచక్రవర్తినాటిదికాదు. మన వంశమూలపురుషుడైన సూర్యుని తరువాతనుండి వచ్చుచున్న యీ యనూచానాచారమునకు విరుద్ధ ముగ జ్యేష్ఠపుత్రుడే పట్టాభిషేకార్హుడనిన సృష్ట్యాది సమాగతపూర్వాచార మునకు విరుద్ధముగ మనతండ్రిగారు మా తాతగారి కన్యకొఱకు, జన్మింపని మనుమని రాజ్యమునుగూర్చి చేసిన యీ విపరీతవాగ్దాన మేల చెల్లవల యునో నన్ను క్షమించి దేవరవారు సెలవిచ్చెదరుగాక!

రామ; (చిరునగవుతో) వత్సా ! భరతా ! చెప్పెదను వినుము. ఆ వాగ్దానము చెల్లుటయు జెల్లకపోవుటయు మన మిప్పు డాలోచింపవలసినలేదు. నీ పట్టాభి షేకమును నావనవాసమును నత్ఫలసత్కృతముగ వచ్చినవికావు. వానికి మీతల్లిగారి వరద్వయమే కారణము. నా పట్టాభిషేకమును మానినందువలన దండ్రిగారి కసత్యదోషమురాలేదని చెప్పుటకుగాను, నీవును నేనును బుట్ట

నపుడుకూడ జేయబడిన తండ్రిగారి యీప్రాచీనవాగ్దానమునుగూర్చి ప్రశం సించితిని.

భర : జ్యేష్ఠానుక్రమాచారమునకు విరోధముగ మనతండ్రిగారు మాతల్లి కిట్టి యసందర్భపరముల నీయవచ్చునా ? ఇచ్చిన నవి నెరవేర్పదగునా?

రామ; నాయనా! మనకు శాసనమని? యాచారమని రెండు రెండును ముఖ్యములేగాని శాసనము ప్రప్రథమము ఆచారము ప్రపంచయాత్రినదుపాయము కొఱకు మనచే నిర్మించుకొనబడినది. సత్యమాడవలయు ననునది శాసనము. జ్యేష్ఠపుత్రి పట్టాభిషేక మాచారము. మన తండ్రిగారు తన సత్యమునే నిలుపు కొనదలచినచో బూర్వాధారవైరుధ్యము గలుగును. పూర్వాచారమునే యనుస రింననచో దైవరూపమగు సత్యమున కున్మూలనముగలుగును. అట్టిసంధియందు మహానిపునుడైన మనతండ్రిగారు సత్యమునే పరిపాలించి, పూర్వాచారమును బరిత్యజించి సత్యవంతులలో నగ్రగన్యు లనిపించుకొని కృతార్థులైరి.

గీ. చట్టమున కెప్పు డాచారసరణి భేద
మగునో యాచారమును ద్రోయు దగును తండ్రి
శ్రుతతతకి స్మృతి యెప్పుడు విరుద్ధమగునో
యపుడె స్మృతి నిరాకరణీయ మగునుగాదె ?

కావున, గీ. సర్వవిధముల తండ్రిరాజ్యంబు నాదె
కానలో నీదుముని వేషకలన నేను
గానగాలేను నాయనా ! దీని మాని
త్వరగ బట్టభద్రుడవు గావలయు నీవు.

భర—గీ. సర్వవిధముల దండ్రిరాజ్యంబు నాదె
యగుట దానిని రామచంద్రార్పణంబు
జేసికొంటిని శ్రీరామదాసుడ నగు
నితనితోపాటు జనుల బాలింపవయ్యా !

(సాష్టాంగపడి యేడ్చును.)

వసి: సెబాస్ ! భరతుడా!

రామ: నాయనా ! లే. ఊరకుండుము. విచారింపకు

(కన్నీళ్ళుతుడిచి తన కన్నీరు తుడుచుకొనును)

గీ. ఎఱిగియుండియు నిటు పల్కు దేల తండ్రి !
సత్యబద్ధుడనై కదా జనపదంబు
వదలి యడవిలోనుంటి; గావలసినద్ది
సత్యపాలనమో ? జనసాసనంబొ

గీ. నేను నాతండ్రి యానతినింద జేసి
యెటులు రాగల్గుదును రాజ్య మేలుటకును ?
విను, త్రిలోకరాజ్యము లభించిననుగాని
తండ్రిమాటకు నే జవదాటజాల.

భర: మహాత్మా ! రామచంద్రా ! మీరు పితృశాసనవిరుద్ధముగ నయోధ్యకు రానక్కరలేదు, కాని,

గీ. ఏ నొసగురాజ్యమును స్వీకరింపవలయు
నేను రా జనుమాట సహింపలేను
రాముడే రా జనకయున్న బ్రతుకలేను
వనిని మీ రుండి పాలింపవచ్చు నయ్య !

రామ: వత్సా !

గీ. రాజసదసున మనతండ్రి రామభరత
గతివిభేదము చేసె నీగాత్ర మటవి
బెట్టి యధికారమును సింహపీఠి బెట్టి
వఱల, నాయాచారణము సంకరముగాదె ?

భర: అట్టిసందేహమున్న నటులు వలదు.

గీ. బరువు మోయంగవలసిన యిరువురు వరు
లెటులో మోయంగ, దగుగాని యిర్వు రందు
ముందువాడు వెనుకకేగి, ముందునకును
వెనుకవా డేగి వహియింప భేదమేమి ?

అలాగే

గీ. కలిసి తండ్రియానతి దీర్పవలయు మనము
వ్రతములను మాఱ్చుకొనినను బాధగలదె ?"

ఏలుడీ మీఁద, లే బదునాలుగేండ్లు
నడవి జరియించి పరమధన్యతను గాంతు.

వసి- సెబాస్! భరతుడా! ఎంత గురుభక్తియుక్తుఁడవు! ఎంతవైరాగ్య సంపన్నుఁడవు?

రామ- (ముక్కుపై జేయివైచుకొని) వత్సా! భరతా! ఎంతవాడవు? తండ్రీ ఇటురా. ఇటురా. (కౌగలించుకొనును) (నవ్వుచు) బరువు మోయువారలలో ముందువాఁడు పెద్దవాడు, వెనుకవాడు చిన్నవాడుగా నుండవలయునని యా బరువున నధికారి యాజ్ఞాపించుచో నట్టిమార్పు చేయఁదగనిదేకద. ఆ ర్తిచే జెప్పిన మాటయే చెప్పుచునాచ్నువు. నాయనా! నాకు వనవాసము తప్పదు. నీకు దండ్రిగారి యాజ్ఞ ప్రకారమే కాకుండ, నాయాచేజ్ఞ గూడ రాజ్య పాలనముతప్పదు. జ్యేష్ఠపుత్రుండ వైన నాకు రాజ్యము లేదని నీవు పరితపింప వలదు.

సీ. నిఖలకోసలభూమి నీకు రాజ్యంబౌను
నాకు రాష్ట్రము కాననస్థలంబు,
స్వచ్ఛాతపత్రసచ్ఛాయ నేలుదు వీవు
మృదుతరుచ్ఛాయ నేలుదును నేను,
వరసంఘుపరిపాలనయశంబు నీవంతు
నావంతు మృగపాలనప్రతిష్ఠ,
తమ్ముకుఱ్ఱడు నీకు దగు సహాయుం డగు
భ్రాతచేతను సుఖపడుదు నేను,

గీ. దండ్రిమకుటంబు శిరమున దాల్తువీవు,
తండ్రిమాటను నేను మూర్ధమునదాల్తు
నీమునీంద్రులు నిన్ను దీవించుచుందు
రాఋషీశులు దీవింతు రయ్య నన్ను.

వసి- (తనలో) ఆహా. దివ్య మహర్షులు రామ భరత సంభాషణ శ్రవణ కుతూహలులై యంతరిక్షమున నిలిచియున్నారు. ఇదె యెంతటి సుదినము!

భర- ఓ జాబాలి వసిష్ఠ మునీంద్రులారా [illegible] నేమి [illegible] మీరైన మీ శిష్యున కుపదేశింపరా? దీనుఁడై [illegible] సహించి బ్రతుకలేఁడని యానతీయరాదా? ఓ [illegible]యులారా! [illegible]

జాబా- (అపవారించి) వసిష్ఠా! నీవు ప్రసంగింపుము.

వసి- (అపవారించి) "జాబాలి పసిష్టులారా" యని భరతుఁడుమనల నుద్దే శించినాఁడు. కావున ప్రథమమందు నీవే ప్రసంగింపక తప్పదు.

జాబా- (అపవారించి) ఏవోకొన్ని వెఱ్ఱిమొఱ్ఱి మాటలజెప్పెదను. (ప్రకాశముగా) శ్రీరామభద్రా! మహా ధీమంతుఁడ వైన నీ వప్రాజ్ఞ పురుషునివలె నాచరించుచుంటివి!

గీ. తండ్రియానతి బట్టి సత్యప్రపాల
నంబుకై, బరలోకసౌఖ్యంబుకొఱకు
వనిని వసియింతు నంటి వెన్వండు తండ్రి
సత్య మెక్కడ? పరలోక సరణియేది?

గీ. నరు డొకడె పుట్టు నొక్కండె యరుగు; నతని
కెవడు లే డెవ్వనికి నెవ్వ డేమికాడు
తల్లి దండ్రి కొడు కనుబంధతతియెల్ల
వస్తుతత్త్వజ్ఞ తాభావభవఫలంబు.

గీ. కానబడెరథుడు తండ్రిడుడు నీకు
నతని సుతుండవుకావు నీ వతనిమాట
బాటిసేయంగ దగ దయ్య; ప్రజ్ఞ లేని
వారు పలికెడు సత్యంబు వదలుమయ్య!

గీ. ఆత్మయనునది మిథ్య; దేహంబె యాత్మ
భూతపరమాణుసంవాసమునను నొక్క
వింతచైతన్యశక్తి యావిర్భవించె
కిణ్వవస్త్వాదుల మదశక్తివలె రామ!

గీ. ప్రబలభూతచతుష్టయబంధురాను
వింధమే బంధమాజుమ్మ; హాని బక్షు
మేయగును మోక్షసామ్రాజ్య; మింతకంటె
బలుకులోదక్క బర మనుపదము లేదు.

గీ. తనసుఖంబునె తా జూచుకొనగవలయు
బరులతో నంతకంటెను పనియెలేదు;
చందనాదిసుఖంబులే స్వర్గమగును,
జ్వరకృపాణాదిబాధలే నరక మగును.

గీ. అందఱి యనుభూతిని నున్నయంశ మిదియె;
చెప్పనొక్కఁడువలెనె ? యోజింపవలెనె ?
మనకుఁ బ్రత్యక్షమే నిదర్శనము; కాన
సర్వలోక సమ్మతమతసరణి యిదియె.

గీ. దేహసౌఖ్యమె సౌఖ్యము; దేహపీడ
పీడ; కావున గానను వీడి నాదు
పలుకు మన్నించి, భరతు నాపదను బాపి
ప్రజలఁ బాలించి, సుఖియించి, ప్రబలు మయ్య !

రామ:-మునికులతిలకా! గురుశిష్యు లిద్దఱకు ననర్హమైన విచిత్రోదేశ మొనర్చిరి.

గీ. నేను దశరథసుతుఁడను గానొ? యతని
పలుకు వినరాదొ? యెవనికేన్వాండు కాఁడొ?
అట్టిచో మీ రెవరని మీ రానతిచ్చు
ననవసరవాక్య మిపుడు నే వినఁగవలయు?

గీ. భరతుమాట నే మన్నింప భరతుఁ డెవ్వఁ
డే నెవండను? జను లెవ్వ రేల వారి
నేలవలె దండ్రిమాట మన్నింప దగదు
నాదుపలుకును విను మన న్యాయమగునె ?

గీ. మును లెఱుంగనివచనము లుర్విని గలవె
కాని మీ రన్నమాటల కేను మాఱు
పలుకకకుంటకు మన సుండఁబట్టకుండేఁ
గాన దయతోడ క్షమియింపు మహానివర్య !

గీ. మనల మనతల్లి గనుచుండ మనము చూడ
లేదు; చూడలే దవి తల్లిగా దటంచు
ననుటలే; దెందుచేత ? ప్రత్యక్ష మొకఁడె
గాదు; శబ్దానుమానము లగలవు మనకు.

గీ. నాస్తికుండు ప్రత్యక్షమే యనుసరించి
వంధ్య తనతల్లియం చనవలసివచ్చు

నేమో ? ప్రత్యక్ష మొక్కఁడే యెపుడు పనికి
రాదు చార్వాకునంతటి ప్రాజ్ఞునకును,

గీ. భూత సన్ని పాతంబునఁ జేతనాఖ్య
శక్తియుదయించె నంటి, రాశక్తిగలుగు
చుండఁ జూచినవాఁ డేఁడి ? యుండుటకును
సాధనం బేడనయ్య వాచంయమీంద్ర !

గీ. కాన నేతద్వచన మనుమానముననె
కలిగె; వృద్ధిక్షయాదిసంకలిత దేహ
మాత్రమైనఁ బూర్వపుస్మృతు లలవడుటకు
నేమియవకాశ మున్నదో యెంచరాదె ?

గీ. ఇంతయున్నను, మఱియుఁ దా నింతయున్న,
నవయవము లన్నియూడిన, నల్ల "నేను"
మాఱ; దదిస్థిరము తనువు మరణమొందు,
నేను లేననుమాట మెట్టైనిఁ గలదె ?

గీ. కాన ప్రత్యక్షమున కనుమానశబ్ద
మునలనుగూడఁ జేర్పకపోనఁ దలముగాదు
ప్రాణమోక్షమే మోక్షసామ్రాజ్యపదవి
యనెడువాక్యంబు పరమహాసానస్ప్రదంబు.

గీ. శిశుహాసనకు చపానాదిచేష్ట లెటులు
గలిగెఁ బూర్వానుభూతిలేక యెటుకలుగు
రాగమును ద్వేషమును ? తనుప్రాప్తి లేక
యనుభవం బెట్లు ? కానఁ బ్రాక్తనువు నిజము.

గీ. కారణము లేనివిముఖత, కారణంబు
లేనిదయ, యొకనికొకని పైనఁగలుగఁ
దఱచు చూచెద; మది యిహ తనువిరచిత
కృత్యఫలముగాదు; పురాత్త కృత్యఫలము.

గీ. పూర్వజన్మంబు నిజమటాట, ముందుజన్మ
మటులె జీవాత్మకుండుట యద్భుతంబె

నిన్న యనుపూర్వసంజ్ఞతో నున్నకాల
మునకు తెపెట్టు లుండక పోవునయ్య ?

గీ. జన్మవైషమ్యకరణదక్షం బగునది
కర్మ; ముత్తమాధమకర్మకలన, వరుసc,
బుణ్యపాప జన్మములగు; మోక్ష మనగ
నీపునర్జన్మరాహిత్యమే మునీంద్ర !

గీ. కృత్య జన్మాంతరంబు లంగీకరింప
బరము వానితోడిదె; సత్యపాలనంబు
కర్మములలోన నుత్తమకర్మ మగుట
నేను శ్రద్ధతోడుత నాచరింతుదాని,

గీ. నిజసుఖాప్తియే యుత్తమనీతి యన్న
బలులచే దుర్బలులు బాధపడరె ? జగము
కలహసంక్షోభ మొందదె ? కర్మధర్మ
తతినశింపదె ? ప్రళయంబు త్వరగరాదె ?

గీ, ఆత్మయున్నది పరమున్న; దదియుగాక
యున్న దనుకొని నడువ, లేకుంట కీడు
లేకయున్నను; లేదని పీకనడువ
నమితహానియో నున్కి యథార్థమైన

గీ, దురుపదేశంబు చేసినందులకు నేను
జింతనొందను; నాతండ్రి చెలిమికాడ
వైన నీతోడ జర్చింప నయ్యె నింత
యనుచు జింతింతు; క్షమియింపు మయ్య నన్ను

జా—గీ. లేదు లే దని నే బల్క లేనిదగునె ?
లేదనెడు వృత్తితో బల్కలేదు; మఱియు
లేకపోవుట యెన్నడు లేదు; కాని
లే దన గతంబు లేకపోలేదు; రామ !

రామ : వినదలచితిని.

జా—గీ, శిష్టరక్షణదుష్టసంశిక్షణార్థ
మవతరించిన లోకోత్తరావతార
మవని యుప్పొంగి, నీను మహితపాల
నము నపేక్షించియుంటి మిన్నాళ్ళవరకు

గీ, అట్టిచో, మావలె జటాలి జుట్టి, ముక్కు
మూసికొని, జాడ్యమున వనమునను గూరు
చుంట, ధర్మసంకటముగా నుండె గాదె ?
జగతి నీవుద్ధరింపక జరుగుటెట్టులు ?

గీ, ఇట్టియఖిలలోకాపద యెనసియుండ
దండ్రిపలుకంచు, వనమందు, దఱలిరాన
టంచు బలుకన్యాయంబె ? లోకాళిబోవ
వలసినప్పుడు తండ్రిమాటలు ఘనంబె ?

గీ, భువనవిపులార్తిమంతట పుత్త్రు డెవడు
తండ్రి యెవ డంచు బలికితి; దత్త్వదృష్టి
దలప, బరమాత్మనౌ నీకు దండ్రి యెవ్వ
డేది నీ కాత్మ ? పరము నీ కెక్కడయ్య ?

వసి: (తనలో) జాబాలి యెట్టులో దాటుకొనిపోయినాడు. (ప్రకాశముగ) వత్సా! రామభద్రా! భరతుడు, జాబాలి చెప్పినదానికంటె నే నెక్కువ చెప్పజాలను. నీయభిప్రాయమును జూడ జెప్పనక్కఱయులేదు. కాని చెప్పకపోవుటకు మన నంగీపరింపకున్నది. దేహప్రదానమున మాతాపిత లెట్లు పూజ్యులో యనిరా కరణీయులలో బ్రజ్ఞాప్రదానమున గురుడు గూడ నటులే కాన. నామాట ద్రోసి వేయక భరతుని ముద్దుజెల్లింపుము.

రామ: మహాత్మా! మీరు నాకు పితృసములు. ఏమాత్రమును సందేహము లేదు. మీరు నాకు మత్తేదైన నాజ్ఞాపింపుడు. ప్రాణములు విడుచుచునైన జేయు దుకు. అంతేగాని మా తండ్రియాజ్ఞను నిరోధింపుమని మీ రాజ్ఞయిడుట న్యాయమా? మీయాజ్ఞ నుల్లంఘింపుమని మాతల్లియాజ్ఞయైనచో నామె మాట నేను విందునా? వినక పోయినను దల్లి౦క్షమింపదా? అటులే మీరును.

భర: ఓ యార్యులారా! ఓ మహామునులారా! నాదుర్మందభాగ్యముచేత, నా మహాపాపముచేత శ్రీరామచంద్రుడు నా ప్రార్థనలను మీయాజ్ఞలను గైకొన

దయ్యేను. మీ రేమిచేయగలరు? ఓ జనులారా! ఓ కోసలదేశ వాస్తవ్యులారా! రామవనవాస దర్శన వాంఛాగతులారా! మీ కొక్క మనవి జేసికొందును వినుడు.

సీ, రామాభిషేకమో, రామాభిషేకమో
యని పలవించినయట్టి మీదు
కత్తుక ల్మోదలంటగోసెను మాతల్లి;
రామచంద్రుని బాసి బ్రతుకగలరె
"మమ్మేలు మమ్మేలుమా" యంచు బలుకుడి:
బతిమాలుడీ; దైన్యభాషణముల
మోడ్పుచేతుల నెత్తి మ్రొక్కుడీ; పదముల
భక్తితో జాగిలబడుడీ;
గీ, మంటదీఱ నందఱు నొక్కమాఱు గొంతు
లెత్తి పెల్లున నేడ్వుడీ, యొకపుడు
సరసవాక్తతికంటె నిష్కపటసాంఘి
కార్తి గురుదయాపాత్రమై యలరుచుండి

[నేపథ్యమున] రామభద్రా! రామచంద్రా! మమ్ము బాలించువారెవరు? మిమ్మువిడిచి బ్రదుకగలమా? మమ్మెవ్వరి కప్పగింతువు? రక్షించు? రక్షించు.

రామ: ఓ జనులారా?

గీ, ఎవడు తన రాజ్యమును నాకు నీయ దలచి
వచ్చెనో? యెవ్వడు వైరాగ్యవైభవుండో?
ఎవడు జనరంజనచరణసమిద్ధగుణుడో?
యట్టి నాతమ్మునికి మిమ్ము నప్పగింతు

భర: హరిహరీ! హరిహరీ! ఎంత ప్రారబ్ధము తటస్థించెను! ఇంతేనా! జనులారా! ఊరకుంటిరా? ఇక జెప్పువారెవ్వరులేరా? అందఱును రామసన్నిధిని మౌనులేయయిరా? నాపాప మింతేనా? జగదవనకళాసాంద్రుడయిన శ్రీరామచంద్రు డుండ, నిర్భాగ్యుడైన భరతుడు సింహాసనమున గూర్చుండవలసినదేనా?(ఏడ్చుచు) ఓ సుమంత్రుడా! నీ వేమైన మాయన్నగారికి జెప్పరాదా?

సుమం: వత్సా! ఊఱడిల్లుము.

భర: ఊరడిల్లుదును. సంపూర్ణముగ శాంతి నొందుదును, ఆ కుశాస్తరణ
మును దెచ్చి యిక్కడ దయయుంచి పఱువుము.

సుమం: అదేల?

భర: నేనే తెచ్చుకొందును. నీకు శ్రమమేల?

(తాను దెచ్చుకొని పఱచుకొనును.)

గీ, అశనమును మాని యంబుపానాశ వదలి
పంచపవమానచలనంబు బందుచేసి
విమలకుశశయ్య బ్రాయోపవేశ మనెడు
వ్రతము నేనాచరింతు శ్రీరామచంద్ర !

(నమస్కరించి కుశశయ్యపై గూరుచుండును.)

రామ: (కన్నులనీరు గ్రుక్కుకొని) నాతండ్రీ! నేను నీకేమి యపకార
మొనర్చితినని. నీవస్తు వేది హరించితిని, నీ విట్టి భయంకర వ్రతమును నాయెదుట
బూనదలచితివి? తమరిచ్చిన ఋణమును హరించిన పాపాత్ముల గృహముల
యెదుట బ్రాహ్మణులు చేయదగిన యీ ఘోరవ్రతము క్షత్రియులమైన మనకు
దగునా? తగదు. తప్పుపని జేసితివి కాన బ్రాయశ్చిత్తార్థమై నన్ను స్పృశించి పిదప
జలమును స్పృశియింపుము.

భర: హా! ఈప్రయత్నముకూడ విఫలమా! (అటులుచేయును)

[నేపథ్యమున] భరతుడా! నీవు నీతండ్రి యుత్తమలోకసుఖముకై చూచు
వాడవైనయెడల రామభద్రునిమాట వినక తప్పదు. రాము డెల్లప్పు డిట్టులే తండ్రి
యెడల సత్యవాక్యపరిపాలన దీక్షాదక్షుడై యుండవలయునని మా యభిప్రాయము.
కైకేయిగుఱించి చేసిన సత్యవాక్యముల నిర్వహించుకొనుటచే దశరథుడు స్వర్గ
సుఖ మందుచున్నాడు.

రామ: (చేతులు జోడించుకొని) దివ్యర్షులారా! నమస్కారము. మీవాక్య
ములు శిరమునధరింపబడినవి. తమ్ముడా! పరమర్షులయాజ్ఞ యెటులున్నదో వింటివి
కాదా! ఇక నిర్విచారముగ బరిపాలింపుము.

భర: (ఏడ్చును) ఇంతే! ఇంతే! మీరురారా? నేనొక్కడనే పోవలసినదా?
మహాప్రభూ! నాకు రాజ్యమక్కఱలేదు. జ్యేష్ఠులరైన మీ రెపుడు రాజ్యమును
నిరాకరించితిరో యిపుడు దానికి గనిష్ఠ దర్హుండు కాని మధ్యస్థులుగారు. నా రాజ్య
మును శత్రుఘ్నునకిచ్చి మీతో వనవాసమున దినములు గడపుకొందును, అమాత్ర
మైన గటాక్షింపుడు. (సాష్టాంగపడును)

రామ: (భరతునిలేవనెత్తి తొడపై గూరుచుండబెట్టుకొని) అట్లుకాదుతండ్రీ! చెప్పినమాట విను. తండ్రిగారి యానతి కౌక నివ్వరి ముల్లంతయైన మనము భేద మొనర్చిన; యాయన యుత్తమలోక సౌఖ్యమునకు భంగము కలుగును. అది యటుండనిమ్ము.

సీ, స్థిరమైననడవడి నరులకందభకును
వలయును; రాజ్యచాపల్యమునను
నే దండ్రిమాటను నిరసింప లోకులు
పరిహాసింపరె? రామువంటికొడుకు,
భరతసౌమిత్రులవంటితమ్ములు. సీత
వంటిభార్యయు, లేరు వసుధ నంచు
ముందుయుగంబుల బురుషులు తలలూప
వలదె?యీరీతిని వారు నడచు
గీ, కొనవలదె? విష్టసుఖములు మనకు శాశ్వ
తములె? పదునాలుగేడులు దాట దిరిగి
రానె? ధరను బాలింపనె? దానినంత
వఱకు దయ నీవు బాలింప వలదె? తండ్రి!

భర:- మహానుభావా! మీ రట్లు బోధించుచున్నారు. గావున మీ చిహ్నమే దైన నాకు దయచేసియెడల దానిని బురస్కృతమున జేసికొని నేను బాలింతును.

రామ: ఆలాగే! తండ్రీ! నీకిష్టమైనదానిని వాంఛింపుము.

భర:- మీచరణములతో మీపాదుకలను స్పృశించుడు. వానిని నేను గ్రహింతును.

రామ:- (అటులుచేయును.)

భర:-(పాదకలను దీసికొని కనుల నద్దుకొని) మహాప్రసాదము. మహాను భావా! ఈవిధముగానైన దాసుని ధన్యాత్మునిజేసిరి.

రామ:-ఇక నొక్కమాట.

గీ, నీవు వల్లెత్తుమాటైన నీదుతల్లి
ననిన నాతోడు ధారుణీతనయతోడు
సత్యవాగ్దీక్ష ననిశంబు సలుపవలయు
బ్రజలు నీపుత్త్రు లనియెంచవలయు నయ్య!

నీవు పురమునకు బొమ్ము; ఇఁక నేను బోయెదను.

భర:- రామా! రామా! రామా! (ఏడ్చును) ఈ పదునాలుగేండ్లెంత దీర్ఘమో యంతి దీర్ఘమైన యాశ్లేషము నాకొసగవలయును.

రామ:- (కౌగలించుకొని) ఈ కౌగిలి యెంతదీర్ఘమో యీచతుర్దశవత్సర పరిమితిగూడ నంతదీర్ఘముగనే ననుకొనుము. మునీంద్రులారా! నమస్కారము. నాకు సెలవిండు. లక్ష్మణా! నేను బర్ణశాలకుబోయి మనతల్లుల నశ్వాసించి వారిని భరతశిబిరమునకు శత్రుఘ్నునిచేఁ బంపెదను. నీవు మునీంద్రులయొద్దకు భరతు నొద్దను సెలవుదీసికొని, నన్ను మనకుటీరమున గలిసికొనుము. ఇప్పుడే ముందరి యాశ్రమమునకు బోవలయును.

భర:- అగ్రజా! ఈ పదునాలుగేండ్లు గడచిన యుత్తరక్షణమున మీరు రాకుండిన నే నగ్నిప్రవేశ మొనర్తును. నిశ్చయము నిశ్చయము.

రామ:-రాకపోవుటకూడనా?

(రాముఁడు నిష్క్రమించును.)

లక్ష్మ:-(బట్ట మెడఁజుట్టుకొని భరతునికి సాష్టాంగపడ) అగ్రజా! రాజ్య లోభమున రామచంద్రునికి ద్రోహ మొనర్చుటకు నీవు వచ్చుచుంటివని నీయెడల బహుఘోరమైన యపోహ మొందితిని. క్షమింపుము.

భర:- తమ్ముడా! లెమ్ము. అది నీ దోషముగాదు. మాతల్లిదోషము. నీ వొక్కడవని నిన్ననృథాయెంచితి ననుకొంటివా? గుహుండో! భరద్వాజుడో! వీరు ప్రత్యక్షముగ నడిగినారు. ఏడ్చి యేడ్చి నానిర్దోషితను వారియొద్ద వెల్లడించు కొంటిని.

లక్ష్మ:- అగ్రజా: గుహుండు పరమభక్తుడు. సీతారాములిద్దరు గుహనివాస ప్రాంతమున నిద్రించుచుండ నేను వారిరక్షణమునకై మేలుకొని వారిచుట్టు ఖడ్గ పాణినై తిరుగుచుంటిని. నేరు జానకీరాముల,కేమి యుపకార మొనరింతునో యని గుహుడు నాపై కాపుగాయుచుండెనట,

వసి:- లక్ష్మణా ! నీ వంతయేవింటివి! గుహునిపై సందేహముతో నాతని భటులాతనిపై గాపుంచిరట,

భర:- లోకోత్తరుడైన శ్రీరామచంద్రమూర్తియందలి భక్తియందఱనటులు చేయించినది, అందరు నేను ద్రోహినని సంశయించినవారే! నా దినముల మహిమట్టిది?

వసి:-నీ చిత్రకూటయాత్రచేతను! నీ శరణాగతిచేతను, శ్రీపాదుకాగ్రహణముచేతను నీవు శ్రీరామభృత్యుడనని లోకమునకు వెల్లడియైనదికాదా?

లక్ష్మ:- అన్నగారు నాకొఱకు వేచియుందురేమో! నాకు సెలవిండు. మునీంద్రులారా? నమస్కారము. అగ్రజా! నమస్కారము. (పోవును)

వసి:-భరతా! మన మిక నయోధ్యకు బోవుదమురమ్మ

భర:-రాముడు లేనియయోధ్య నే బ్రవేశింతునా ?

వసి;- ఈ పాదుకల నెక్కడ నభిషేకింతువు?

భర:-నందిగ్రామములో.

వసి:- సరి, అక్కడకైన బోవుదము రా !

భర:- మునీంద్రా! నాకొక్క యాలోచనము తోచుచున్నవి. రామునికి మాతండ్రి పట్టాభిషేకము చేయదలచి సర్వప్రయత్నములజేసి తుదకు జేయలేక పోయెను. చిత్రకూట మెక్కడ? నందిగ్రామమెక్కడ? ఎన్ని యరణ్యములోదాటి పోవలయునుగదా. ఈ లోపున నేను దేహవ్యాధిచే మరణింపగూడదా? సర్పదష్టుడనై మృతినొందగూడదా! దేహము లశాశ్వతములుగదా! ఈపాదుకాభిషేకవైభవమైన నాకన్నుల బడదేమో! కావున, నీ స్థలముననే యిప్పుడే వీని నభిషేకింపవలయును,

వసి:-అనేకవస్తుసంఘములు కావలయునే ! ఇచ్చట నెట్లగును?

భర:-అక్కరలేదు లఘుమార్గముగ నభిషేకింపుము. తరువాత నందిగ్రామమున విధ్యుక్తముగ సమస్తవైభవసమన్వితముగ జేసికొనవచ్చును.

వసి:-ఎందుల కితొందర? ఇక్కడ సింహాసనలేదే

భర:-అటులలనేల? (మోకరించి) నేనే సింహాసనమును నా శిరముపై శ్రీపాదరల నుంచుకొంటిని అభిషేకింపుడు.

వశి: (కమండలూదకమున నభిషేకించి) ఓ సాకేతపురనివాసులారా! మీ పుణ్యవశమున భరతుడు శ్రీ పాదుకాద్వయమును సంగ్రహించుకొనివచ్చినాడు. మీ కీ పాదుకాద్వయమే ప్రభువు. రాజ్యవ్యవహారములన్నియు నీపాదుకలకు నివేదించి భరతుడు తత్పురస్కారముగ బరిపాలించును.

(నేపథ్యమున) జయము-జయము-శ్రీపాదుకలకు జయము.

వసి:-భరతుడా! లెమ్ము. శ్రీపాదుకాపట్టాభిషేకమైనది. నీవు ధన్యాత్ముడ వైతివి, ఇంక నీవు కోరదగినదేది?

భర:-మీదయచే నింతవదకు గృతార్థుడనైతిని. ఇక నందిగ్రామమునకు బోవుటతప్ప వేరుకోరిక లేదు. ఐన నిటుల కోరెదను.

గీ, ధరణి యీతిబాధలు లేక తనరుగాక!
ప్రజల యన్యోన్యవైరముల్మాయుగాక!
కవిత రాజపోషనమున రాజుగాలుగాక!
నీతిపాలనమున రాజు నెగడుగాక!

వసి:-తథాస్తు. తథాస్తు.

(అందరును నిష్క్రమింతురు.)

విక్టరీ ప్రెస్, విజయవాడ-1.

# ప్రకటన

మాకు సర్వహక్కులు కలిగిన ప్రఖ్యాత రచయితలచే వ్రాయబడి పేరుగాంచిన స్టేజినాటకములు, కథలు, చరిత్రలు నవలలు, స్కూలుకు ఉపయోగించే అనేక ప్రఖ్యాత గ్రంథములు కలవు. కాపీరైటు యాక్టు ప్రకారము మా అనుమతిలేనిదే ఏ రచనల నైననూ, ఎవ్వరూ, ఏవిధముగా ప్రయోగించుకొన్ననూ, వారిపై మేము జరుపు సివిల్, క్రిమినల్ చర్యలకు బాధ్యులగుదురని ఇందుమూలముగా తెలియజేయుచున్నది.

శ్రీకృష్ణతులాభారం, చింతామణి, [illegible]సేవ, రంగూన్ రౌడి, ధరణికోట, సతీసక్కుబాయి, ద్రౌపదీవస్త్రాపహరణం, కురుక్షేత్రం, (ద్రౌపది), శ్రీమద్రామాయణం, చండిక, ఖిల్జీరాజ్యపతనం, ప్రతీకారం, రోషన్, పాదుకాపట్టాభిషేకం, చంద్రగుప్త నాటకములలో ఏ నాటకమైనను, నాటక భాగమైనను మా పర్మిషన్ ఫీజు చెల్లించి లైసెన్సుపొంది ప్రదర్శించవలెను. అట్లు పర్మిషన్ పొందకుండా ప్రదర్శించువారిపై మేము జరుపు సివిల్ క్రిమినల్ చర్యలకు బాధ్యులగుదురని హెచ్చరిక.




కురకూరి స్వరాజ్య వెంకటసత్యనారాయణరావు

ప్రొప్రయిటర్ :

సరస్వతి బుక్ డిపో, విజయవాడ-1